# అల్లో నేరేడు

(కథలు)

★

మల్లాది రామకృష్ణశాస్త్రి

★

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవా

# విషయసూచిక

(27)

# మనవి

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు పాఠకలోక సుపరిచితులు. వారి కథలు యిప్పటికి 3 భాగాలుగా ప్రచురించాము. పాఠకులు అత్యంతానందంతో స్వీకరించారు.

ఇవి చూచి శ్రీ శాస్త్రిగారి రచనలు తమవద్ద వున్నాయని, తెచ్చి మా కిచ్చిన మిత్రులున్నారు. వారికి ధన్యవాదాలు. అవికూడా త్వరలోనే ప్రచురించగలము.

పాఠకులు యీ ప్రచురణల నాదరించగలరని విశ్వసిస్తున్నాము.

— ప్ర చు ర ణ క ర్త లు.

★

# 27

# అల్లో నేరేడు

ఎబ్బే! ఇప్పటి పట్నం మునుపటి పల్లెకాదు.

మునుపటి పల్లె ఆనవాలే ఇప్పుడు లేదు.

పాడూరు లేదు - కూలిపోయి పునాదులు మిగిలిన గుళ్లు లేవు, గోపురాలు లేవు! ఎంతలోతు తవ్వినా నిధులు లేవు, నిక్షేపాలు లేవు! ఆ పరగణా హోల్ మొత్తంమీంద, అప్పుడు రాలిన గింజన్నా మొక్క మొలవలేదు. అప్పటికి మొలిచిన మొక్కన్నా మానుకట్టలేదు. ఆనాటికి నిలిచిన మానన్నా, ఒక్క బోదెన్నా, సత్యానికి నిలువలేదు. సంజెదీపం వేళకు కళగాఉన్న పల్లె, మళ్లీ చుక్కపొడిచే వేళకల్లా, ఒక్క మొయిని సురేసుకు పోయినట్టు పోయింది.

ఏమైపోయిం దంటారు?

ఎండకన్నెరుగని ఆడకూతురు అయినవారింట పుట్టి అబ్బనాకారంగా పెరిగి, ఆ యింటఅడుగు పసుపు పారాణితో, పాపిటబొట్టుతో, చెంపన చుక్కతో, సిరులబ్బే చూపుతో యీ యింట పెట్టిన ఆడకూతురు చేయరాని పాపం చేయకపోయినా మోయరాని నింద మోసింది. అయ్యో పాపం! అన్నవారు లేకపోయిరి. కుయ్యో అన్నా గోడు ఆలకించేవారే కరునైపోయిరి. ఆ బిడ్డ ఎంత హడలిందని! ఆ తల్లి బ్రతుకు ఒక్క చిటికెలో చీకటిగుయ్యారమై పోగా ఎంత కుమిలిందని?

ఒక్కకన్ను మూసింది. ఒక్కకన్ను తెరిచింది. ఎందుకు యిచ్చావమ్మా యీ పుటక? అంటూ కన్నతల్లి మీద గావురుమంది. కానరాని తల్లికి మొక్కుతూ గావురుమంది. తెరిచిన కన్ను నిప్పులు చెరిగింది. మూసిన కన్ను ఒక్క ముత్తెం విడిచింది.

ఆ రవంత ముత్తెం సముద్రమంత అయింది. సముద్రం-సముద్రం ఏడుసముద్రాలంత అయింది. ఏడు సముద్రాలు ఏక ఉప్పెనైంది.

ఉప్పెనొచ్చి ఊరు ముంచెత్తింది; పోటొచ్చి పల్లెపల్లే నేలమట్టం చేసింది. ఆటొచ్చి, ఆ చీపరపాపర అంతా తుడిచిపెట్టింది.

తుడిచి పెట్టినంత మేరా - వానదేవుడొచ్చి, కళ్లాపి జల్లాడు. గాలిదేవుడొచ్చి తడి ఆరబెట్టాడు. సూర్యభగవాన్లు అప్పుడు తెరపిచేసుకుని వచ్చి, భూమ్మీద ముగ్గులల్లే నెరియ

విచ్చాడు. అంతే, ఆ పొద్దు మొదలాయె ఆ గడ్డమీద ప్రాణా డదు; ఆ నింగిమీద పిట్టాడదు!

సరేనయ్యా - మరి, ఆ ఆడకూతురు కొచ్చిన నిందేమి టంటారు !

ఆడకూతురికి రారాని నింద !

అయిన యిల్లాలికి కలలో అన్నా రాకూడని నింద ! కట్టుకున్న మారాజే తప్పుబట్టెనే - ఆ తల్లిని అంతమాటంటే పాపమనన్నా తలచక పోయెనే - ఒట్టూ సత్యాలూ నమ్మక పోయెనే - ఇంకేంజెయ్య నాతల్లి? ఇంకెవరితో మొరబెట్టు కోను ఆ అమ్మ !

సీతమ్మంటే సీతామ్మవారేనయ్యా ! ఆ అయ్య రాము డంటివాడేనయ్యా ! అయితేనేం, మూడు పువ్వులూ ఆరు కాయలూ కావల్సిన బతుకు మూణ్ణాళ్ళ ముచ్చట అయింది; ఆ కాపురం ఆరిపోయే దీపమల్లే ఒక్కసారి భగ్గుమంది.

సీతమ్మ సిరిగల యింటపుట్టింది. సంపదున్న యింటికి వచ్చింది! ఆబిడ్డ తెచ్చిన సారె పల్లెఅంతా ముమ్మారు పంచిపెట్టినా, ఎక్కీదక్కీ మిగిలింది. రామయ్య కుటుంబం అంటారా, పరగణా పరగణాకంతా మోతుబరీ అనుకోండి; వారికి ఏంతక్కువ? గీతొక్కటే తక్కువ; బ్రహ్మరాసిన రాతొక్కటే తక్కువ !

సీతమ్మ అల్లా వైభోగంగా సార్లెతో - చీర్లెతో తర్లి వచ్చింది; వెంటను, పట్టెమంచం వచ్చింది, పానుపొచ్చింది; రంగరంగ వైభోగాలొచ్చినాయ్.

తూర్పువేపు గదిలో పానుపేశారు; పడమటింట బంతులు బరి, విందులు చేసుకుంటున్నారు.

వచ్చిన చుట్టాలందరూ, జాజంబంతులు ఆడుకున్నారు. మేజువాణీలు చేయించుకున్నారు.

తెల్లవారుజాముకి ఎక్కడవారక్కడ అలసిపోయినారు: చోటుచూసుకు సొమ్మసిల్లిపోయినారు.

సీతమ్మ అంతదాకా మేలుకుండలా! ఆ విద్దెలూ ఆ చోద్దాలూ ఆ తల్లికి నచ్చలా!

వచ్చే ఆవులింతను చిటికివేసి ఆవులించింది. అక్కడ నుంచి బద్ధకంగా లేచిపోయింది. బద్ధకంగా పోయిపోయి ఆ నిద్దురమత్తులో, అల్లాగే పక్కమీద చోటుచూచుకుని వాలిపోయింది. వాలినపళాన నిద్దరోయింది..

ఏ మూలనో కునుకుతీసిన రామయ్యకు కోడికూత వేళకు ఎవరో వెన్నుచరిచినట్టు మెళుకువ వచ్చింది. తానున్న వెంపు చూసుకున్నాడు, తన వెంపు చూసుకున్నాడు. ఒక్క ఒళ్ళువిరుపులో, పట్టెమంచం యాదకొచ్చింది, పండంటిపిల్లది యాదకొచ్చింది. లేచి నడింవాకిలికొచ్చాడు. చుక్కలమీదికి చూశాడు. ఇంకా జాము ప్రొద్దుందిగదా అనుకున్నాడు. ఉసూరుమన్న ప్రాణికి ఉత్సాహం వచ్చింది. ఒంటికి వేడొచ్చింది, చెంపకు ఒరచూపొచ్చింది. చివాల్న పోయినాడయ్యా, పానుపువేసిన గదిలోకి.

సీతమ్మ పొత్తికమల్లే ఒత్తిలి పడుకుంది, మాంచి నిద్దర్లోవుంది. అట్టె పరకాయించాడు. అడుగులో అడుగేసు

కుంటూ చెంపమీద చిటికేశాడు. చిటికేసినంత చిరునవ్వు నవ్వాడు. అంతే ప్రాపతం ఆ యింటికి.

చిటికెలోనే మేలుకుంది సీతమ్మతల్లి. చిరునవ్వుకు నాగసారంవిన్న ఆడత్రాచైంది. పంచప్రాణాల్తోనూ మిడిసిపడి ఆ మెడ కావిలేసుకుంది. ఏమో కులికింది. ఏమో గునిసింది. ముచ్చటాడేపాణెం నేరనిచిన్నది మూగపోయింది. అయితేనేం గడియలతెరబడి వేగిన వేగూ - సోగిన సోగూ, కనుపాప విప్పిచెప్పింది.

చెప్పిందయ్యా చిన్నదాని కనుపాప. ఆకళింపయిందయ్యా, చినవాడికి. చిలకముక్కుకు దొండపండందినట్టు, జీడు గోరికి చివురాకు అందినట్టు సుఖపడేవాడే !- సుఖపెట్టేవాడే- కాని, చిన్నది ఆ నోము నోచలేదు. చినవాడికి ఆ అదృష్టం పట్టలేదు. తొలిముచ్చటకు కలకట్టుగా, సొక్కి-సోలుతూన్న చిన్నది - అటువాలేదల్లా చటుక్కుమని ఇటుకేసి బెదిరి, త్రుళ్ళిపడి కెవ్వున కేకవేసింది.

ఆ వేసిన కేకకు ముసుగుదన్ని ఒళ్లు తెలియని నిద్దర్లో ఉన్న ప్రాణి చింబోతల్లే ఎగిరి గంతేసింది. ఆ చింబోతు, చింబోతంటారా కాదు కాదు. రామయ్య తమ్ముడు కామయ్య. బంగారువంటి మనిషి, బంగారమంటి మనసు-భయమూ భక్తీ ఉన్న పడుచువాడు.

కెవ్వుమన్న కేకకు మెళకువవచ్చింది. అన్ననుచూశాడు, వదిన్ని చూశాడు. తానున్న పానుపు చూశాడు. అయ్యో రామా అని అంగలార్చి, అన్న పాదాలమీద పడిపోయినాడు.

ఆవురుమన్నాడు. ఎంత తప్పు - తప్పని వాపోయి, తల నేల నేసి కొట్టుకున్నాడు. ఆఖరికి, - అన్నా ! అన్నాడు: 'వదినె మనింటి కొచ్చిన పండగలో ఒళ్లు మరచిపోయినా, అటునుంచి వస్తున్నా, అగరొత్తులు గుప్‌మన్నాయి. ఆగిపోయినా, గుమ్మం వారకొచ్చి తొంగిచూసినా, గుమగుమా అత్తరు దీపం వెలుగుతూంది. కన్నెదర పాలమీగడల్లే పానుపు అగుపించింది. తడిమి చూసినా - తబ్బిబ్బైపోయినా, నడుం అదే వాలింది. ఒళ్లు అదే ఆదమరచింది. మగత మగతగానే పట్టుకుచ్చులాటి శాలవా పైకి లాక్కున్నా, ఒక్క కునుకు తీసి వేద్దామనుకున్నా - మరి ఒళ్ళు తెలియలా ! నా మనవి. ఇంతేనన్నా !'

కామయ్యతల ఛెళ్లున తన్నాడు రామయ్య తండ్రీ ఒళ్ళు తెలియని ఉగ్రంతో ! మెడనరాలు ఫెటఫెట మెటికిలు విరిగినాయ్ ! అంత తాపూతిని, కామయ్య గుక్క తిప్పుకున్నాడు.

'పర్వతంలాగా పడుంటివే. కానరాలేదా తల్లీ!' అన్నాడు.

వెక్కి వెక్కి వచ్చే దుఃఖం ఆపుకుంటూ, 'నా దైవం అనుకుంటినయ్యా ! అలికిడైతే మెలుకువ వచ్చేనని పట్టె నిల కరచుకుని పండుకున్నానయ్యా !' అన్నది సీతమ్మ.

'విన్నావుగందా అన్నా' అన్నాడు లేనిసత్తువ తెచ్చుకుంటూ,' కామయ్య. అనడమేమిటె, మళ్ళీ అన్న రామయ్య మరో తన్ను తన్నడమేమిటె ! తన్నిన తన్నుకు, మెడనరాలు

మరిన్ని మెటికెలు విరిగినయ్. గుండెలు, నాభిదగ్గిరికి నుంగి పోయినాయి. పడగ విప్పిన తాచైనాడు కామయ్య. నిదుర లేచిన సింహానైనాడు కామయ్య. ఏనుగంత సత్తువొచ్చింది. పట్టిన గుప్పిటిపట్టు విదిలించుకున్నాడు. తూలే కాలు దుయ్య బట్టుకున్నాడు. చీమైపోయి, దోమైపోయి, అంటు న్నాడు గండా! 'అన్నా! నా మనవి ఆలకించవయ్యా!'

అన్న - రామయ్య ఏమాటా చెప్పడే - కాళ్ళావేళ్ళా బడి బతిమాలుకుంటోన్న తమ్ముణ్ణి కన్నెత్తి చూడడే!

పోయిపోయి ఏటిబడ్డున కూచున్నాడు. పైన గోడు గల్లే మబ్బుంది. సిగలో పువ్వల్లే సూర్యుడున్నాడు. వింజామ రల్లే గరుడపక్షి ఆడుతూంది.

అడుగులో అడుగేసుకుంటూ కామయ్యొచ్చాడు: అల్లంతదూరాన సీతమ్మొచ్చింది. వచ్చివచ్చి - మూనేసుకు పోయినారు. నోటిమాట రాక - పలుకరించలేక-

జామైంది, గడియైంది రామయ్య కదిలాడు. ఒక్క ఉరు కురికాడు. తమ్ముణ్ణి పట్టుకుని గాను గాడేశాడు.

జామపండల్లే విచ్చినగడ్డం చేతబుచ్చుకుని, కామయ్య నొష్టంలో అన్నకు మొక్కాడు.

"ఒంటిఊపరినవుంది ఈ పుటక!- ఒక్క ప్రాణమూ పుచ్చుకో అన్నా! ఉడుకుమీదున్నావ్! ఉగ్రాలమీదు న్నావ్ - ఈ పళాన నన్ను తెగెయ్యకపోతే నువ్వు బతికేట్టు లేవు" అని బతిమలాడాడయ్యా!-

"ఒంటి పాన్నువిూమంటి రే - పిల్లమనసేయలా!"

"రామరావు !"

"చెయి మీా నెకిపోలా ?–"

"చెయ లేని ప్రశ్నం తవ్వి తల కెత్తుకున్నాడు బిడ్డ – తల్లొచ్చి – పక్కను పండుకుంది. అది అన్నం అంటావా?"

"వదిన్ను కంట జూడలా !"

"ఒక్క రెప్ప-"

"వల్లమాలిన చక్కంది: ఒక్క రెప్పలోనే మనసు గుంజుకు నుంటుంది!– నీవు ఓ రెప్పను చూశావు ! నేను వెయి పుటకలకని మనసిచ్చాను–నిన్ను చీల్చినా మచ్చపోతుందా?–" పసిపిల్లడల్లే బావురుమన్నాడు రామయ్య! అంతతో తమ్ముడు ఉగ్రుడైనాడు.

"తల్లివ యేభాగ్యం తాళికట్టి తెచ్చుకున్న వాడు దక్క నీయలా ! పోనీలే అమ్మ. కన్నవారు పేరెట్టుకున్నందుకు, ఆ తల్లి కష్టాలే నీకూ వచ్చినాయా! మల్లెపూవల్లే మాయింటి కొచ్చావ్. సిగలో ముడుచుకోడం నేరకపాయె. కళ్లనద్దు కుంటున్నా తల్లీ. మా తప్పులుకాయద్దు – మా వంగసం నిలవద్దు. శిక్షించక జాలిదలచావో వేయిపుటకలు పుట్టి వెంటాడుతా –" ఒక్కబిగివిని యీామాటలనేసి సూరడికి మొక్కి రామయ్య తూరీగల్లే పోయి ఏటిలో కలిసిపోయినాడు.

'వాడురాకుంటా వాడేపోయినాడు. యింటికివస్తే ఏలు కుంటా' నన్నడయ్యా! సీతమ్మ ఉలకలా. 'పల్లెకుపోతే తలెత్తుకు తిరగలేను – ఏం గందరగోళంగా ఉందో – ఎన్ని

కమామేషులు పుట్టినాయో - అన్నీ నరంలేని నాలుకలు -'.
సీతమ్మ పలకలా !

"కాపురం పాడుచేసుకుంటావా ?-" సీతమ్మ మరింత ఉగ్రంగా నవ్వింది. రామయ్య షోకులల్లే రొప్పుకుంటూ పారిపోయినాడు. పల్లెలో కనబడ్డవాడల్లా పలుకరించాడు. కంట బడిన ఆడకూతురల్లా నిలవేసింది ! ఏమైంది సీతమ్మ ? ఏటొడ్డు నుంది. తాను తెగించిందా నువ్వు విడిచావా ? దైవానికి తెలియాలి. ఊరుకు వంక తెచ్చింది ! కత్తులు లేచినాయ్, కటార్లు దూసినాయ్ - పల్లెపల్లే ఏటివారకు దండుకట్టింది.

అక్కడ సీతమ్మ తపసులో ఉంది. ధ్యానంలో ఉంది. దిగువనే కాడనో సందడాయె. రానురాను, మందొస్తున్న అలికిడాయె. ఓరచూపు చూసింది. ఒక్కకన్ను విచ్చుకుంది. పుట్టబోయే బిడ్డలు కేరుమన్నారు, తరించబోయేటి వాళ్లు తల్లీ అన్నారు. ఏదీ వినలా, ఆడపుటకైతే యింత అలుసా అనుకుంది. కామయ్యను తలుచుకుని, నాతండ్రే అనుకుంది. ఒక్కపుటక పుట్టావ్ నన్ను ఉద్ధరించావ్. మళ్లీ జన్మలెత్తే పనిలేదు. పగదీరుస్తున్నా బయల్లో కలిసి...అంది.

తెరచినకన్ను నిప్పులు చెరిగింది.

అందుకు ఇదీ కథ -!

# అమరావతి

వైభవ దేవేంద్రుడు, వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభువు. కృష్ణకు యిద్దరి అద్దరి మాగాణం అంతా చెక్కు-చెదరని ధర్మ విక్రమంతో, ప్రజలకు తండ్రిగా, పెద్దలకు విధేయుడుగా, శాసనానికి తలవరిగా, శత్రువులకు చండశాసనుడుగా, ఏలుకుంటూన్న చల్లని హయాములో—

ఎల్లవేళలా, ఎండనక - నీడనక, విచ్చుకత్తులవారు, బరిసెలవారు, బల్లాలవారు, వీనుమిగిలిన వీరరాహుతులందరూ పచ్చెపువాళ్ళ బాదరబందీ, ఏ పరగణాకూ సోకనీకుండా వేయికన్నులుగా వేయికివేయి బాహువులుగా, పరాక్రమాల మెలగుతూ ఉండగా,—

సింగారం పొలిమేరల్లో, ఎన్ని తరాలుగానో ఊడ పాదుకున్న మర్రి - నీడను ఏనాడో, తలపండిన తబిసి చిన్న

పర్ణశాలలో, బుల్లితులసీ బృందావనంమయంగా, కృష్ణాజినం మీద, చిత్రాసనం మీద, దర్భాసనం మీద పద్మాసనంగా-పొద్దు పొడిచిం దెరుగక, సంజకమ్మిం దెరుగక అలా కదలని కాలూ మూసిన కన్నుగా మనకు కానరాని, అదేదో మగతలో ఉండిపోయినాడు.

చివరకు ఎన్నాళ్ళకో ఓనాడు, ఆ తబిసిగుండెల్లో, బొమముడిలో చిక్కిన వెలుగు పట్టపగ్గాలు లేక, ఉబికిఉబికి పండు వెన్నెలై రెక్కలకు అందని మేరకూ పులుగులు నేరని దూరాలకూ ఎగిసిపడి ఎగబాకి, ఆకాశగంగై వరాహస్వామి ఉద్ధరించిన నేలంతా చిలకరించింది: తబిసి కన్ను తెరిచాడు.

తానై కన్ను తెరిచాడు; తనో మనిషి ననుకున్నాడు; తన్ను తా నెరిగినాక దగలున్నాయ్ దప్పికలున్నాయ్ - దాహమైంది తబిసికి. కమండలం ఉంది - ఉదకం లేదు.

ఎవరీ పనికిమాలిందని ఎలుగెత్తనిమానం ఉరుములు పెటున గర్జించింది.

ఆమడదూరాన లేడల్లే పోతూన్న - నీడమనిషి ఒక్క చుట్టుతిరిగి, తబిసి ముందర గిరవాటుపడి, సొమ్మసిల్లబోతూ, నేనే అయ్యా, అని ఆ పాదాలకు మనవిచేసుకున్నాడు.

"నేనంటే"

"దొంగను."

"కావేమో !"

"నాకా అనుమానం లేదయ్యా !

పుట్టింది దొంగ కడుపున

పెరిగింది దొంగ ఒడుపున-
కాదంటే నాకు అవమానం కాదయ్యా!
అది మీ అజ్ఞానం—"

తబిసి, కనపడని కదలికతో, కనురెప్పలో రవంతగా, ఆ పలుకులకూ మొక్కాడు-

"శపించనా!"

"కూడదయ్యా! చేసిన తపసంతా, నా పాపంమీద కత్తి పదునుగా ధారపోస్తారా!

"శిక్షించే వరం - ఏ మహారాజుపరమో చేయండి."
నీడ వెలుగులో మాయమైపోయింది.

పిండారీ మూకలు, దేశం గగ్గోలుచేస్తున్నాయ్. పరగణా అంతటా ఒకటే నరుకుల - వేట్లాట - మన్నె సుల్తానుకు ఈ బెడద చెవి సోకనీకుండా, ప్రజలే, ఏ వాడకు ఆ వాడను, ఏ సీమకు ఆ సీమను కాచుకుంటున్నారు.

సంకురాతిరి పండుగపూట, తెల్లవారకముందే వెంకటాద్రి ప్రభువు కృష్ణలో స్నానం చేస్తు ఉన్నపాటున ఉండి, ఉలికిపాటుగా "పట్టిందితాతగారూ!" అని, ధైర్యంగానే కేక వేశాడు!

అల్లంత దూరాన జపం చేసుకుంటున్నారు- పాపయారాధ్యులవారు. వారు అరగన్నుగానే, "దేశానికా నీకా, నాయనా!" అని తనలోతాను అనుకున్నారు.

పట్టింది మొసలే అయితే, ఆ మెలుకువ తెలుసును నాయుడికి. ఆ వేటలో తరతరాలుగా మొనగాడాయెను.

కాని ఆ పట్టు మొసలిపట్టుకాదు. ఆ ఒడుపు మొసలి ఒడుపు కాదు. కాలు కరకర మనలేదు. నీరు కందలేదు.

పట్టిన దొంగ పాదంవిడిచి ఉవ్వెత్తున నిలుచున్నాడు.

"ఎవరవయ్యా!" అన్నారు ప్రభువులు.

"బతిమాలేందుకు, పాదం పట్టిన వాడినయ్యా! తల్లి కడుపున తారసిల్లాం - దానంచేయవయ్యా - దయా, జాలీ, ఆచేత, ఈచేత ధారపోయనయ్యా తండ్రీ!"

పాపయారాధ్యులు - సందడిగా చేరువకు వస్తున్నారు- వస్తూనే సెలవిస్తున్నారు- "మరి, పలువిప్పకు మొనగాడా! అర్థమయేట్టు చెప్పేవుసుమీ! ప్రభువులకు పాపభీతి బలిసి, పుణ్యానికి వేసగి వచ్చింది"

వెంకటాద్రినాయుడు తన మనసు ధారాదత్తంచేశాడు. దొంగ ఒక్క మునుకతో ఏటిపాలై పోయినాడు.

వేటలో పట్టితెచ్చిన మృగాలనూ వేడుకచూపించడం ప్రభువులకు అలవాటు. పిండారిమూకను పట్టితెచ్చారని పర గణా అంతటా ఒక్క చిటికెలో సాటింపు అయింది. తిరునాళ్ళకు వచ్చింది ప్రజ-

ఒక్కబారున ఒకే వెన్ను విరుపున చింతలతోపులో ఉంది పిండారిమూక. అటునుంచి నరుక్కువస్తున్నాయ్ విచ్చుకత్తులు: ఇటునుంచి నరుక్కుపోతున్నాయ్ పట్టాకత్తులు, తలలన్నీ రాలినాయ్. ఒక్క తల మిగిలింది. అక్కడ అన్ని కత్తులూ ఆగినాయ్.

ఆ తల ఝుళిపించింది. ఆ కళ్ళు కత్తులు సానబెట్టినాయ్. కాని ఏ చెయ్యీ ఆడలేదు! ఏ అడుగూ ఆడలేదు!

"నాయనా!" అన్నది గొంతు:

కన్నెదుట పిలిచేది. ఆ దొంగ పిలుస్తూన్నది - పాపయారాధ్యులు.

"ఆఁ" అన్నాడు నాయుడు.

చేత కత్తి అందుకుని, ఓరగా చేరువయినాడు.

"ఏం ప్రభూ! దానంపట్టినవాడు ఈవరం మీాపరం చేస్తున్నాడు. ఒక్కటే విసురు!"

ప్రభువు ఇంకా జంకుమీాదే ఉన్నాడు.

"నీవు పిండారీవా?"

"కాను! అంతకన్న గండడిని. ఏం అయ్యా! ఎన్నిసార్లో పట్టి తెప్పించావు పిండారిమూకను. ఎందరినో నరికించావు కాని, ఎప్పటికప్పుడే జాలిపడి అటునుంచి నరికించి ఇటు విడిచావు; ఇటునుంచి నరికించి అటు విడిచావు. నీది దయ అనుకున్నావ్. అంతకే ధర్మమనుకున్నావ్. నీ జాలి మాకు చేటుకానా; మీా ధర్మం పరగాకు ఆపదకానా; మాటికి మాటికి మంటలు ఆర్పావే కాని, చిటిలే రవ్వల్ని ఏం చేశావ్! ఇక చాలించయ్యా! నీకు ప్రజలకన్న దైవముందా, మా మేలుకన్నా పూజ ఉందా? - ఏలే ప్రభువుకు ఎవరు వంకబెడతారు? ఎదుటపడి, ఎవరు తప్పు దిద్దుతారు? నేనొక్కణ్ణే!"

ఏలేవారి తప్పు - నా తప్పుగాదా అనుకున్నా !

"ఎన్ని పుటకలుగానో పరగణాలో దోచుకు బతి కేందుకు హక్కు మాకు ఉంది. పచ్చగాఉన్నా దోచుకుంటే అందంకాని, అల్లాడిపోయే ప్రజను చూస్తే గుండె తరుక్కు పోయింది; అటూ చేయిపోలా, నా ధరమంమీద మనుసూ పోలా.

చలిదన్నా ముట్టకుండా యిటూ పడివచ్చా ! మర్రి క్రింద ఓ అయ్య ముక్కు మూసుకునిఉంటే ఖారబుర్రలో నీరు కాసిని పుక్కిటపట్టినా ! ఆ అయ్య కన్ను తెరిపించి కసిరించుకున్నా. ఒక్క ఉరకనువచ్చి, నీ పాదంపట్టినా - దానంపట్టినా దండులో కలిసి కాళ్లబందామల్లే ఎటూ మెసల నీకుండా - మీచేత పట్టించినా.

నరికిన పుణ్యం మీదేగాని, నరికించిన పంపా నా కెందుకూ - విసురు !—"

నాయుడు ఆ కత్తితోనే ఆ చేతు లలా జోడించి "అమరేశ్వరా !" అన్నారు తగని జాలిగా.

"విసురు !"

విసురన్న మాట విసుకున, కత్తి చళుకుమనడ మేమిటి, ఆ తల ఎగిరిపడడమేమిటి!

తలలేని మొండెం తపసులో ఉన్నట్టు పద్మాసనం వేసింది-తడువుకోకుండా వచ్చి, జీవంతో వున్న వేలు ప్రభువు నొష్టను తిలకం అద్దింది, నెత్తురు జీరతో.

ఆ దొంగ ఆచోకీలేదు. ఆచోటికిప్పుడు ఆనవాలు లేదు; ఆ కథా కమామీషూ నిన్నా మొన్నా పుట్టినవాళ్లకు ఎరికేలేదు !

నాయడిపేరు శిలాక్షరంగా ఉంది ! ఆ ప్రభువు ధర్మం నూటొక్క గుడిలో దివ్వై వెలుగుతూంది-ఎవరి తపసో నిలిచింది. ఎలాగో వెలిసింది అమరావతి.

# "మీమాంస"

ఆతన్ని చూడగానే ఎంతో జాలివేసింది. నాకన్న అట్టే ఎక్కువ వయసు ఉండదు. నాకన్న ఎన్నోరెట్లు కను ముక్కుతీరు బాగున్నది. నాకన్న తెలివితేటలు గల నాజూకైన కవళిక.

తగని నీరసంగా కనబడుతున్నాడు. మాటలో నిలుచో లేక తూలిపోతూ అడుగు బలవంతాన నిలుపుకుంటున్నాడు. చేజారుగా చెరిగి దుమ్ముకొట్టుకు పోడిఆరినజుట్టూ, గరగరలాడేగడ్డం, మాపుపేరుకుని నలుగుడులో పెళపెళలాడుతూ పెళుసెక్కిన, ముదుకపంచా, గుండీలు లేని లాల్చీ.

వెనుకనుంచి నాకోసం తొందరగా నడచివచ్చి నన్ను కలుసుకుని నెమ్మదిగా, మర్యాదగా పలుకరించాడు. అంతకు ముందు, త్రోవలో ఎగువను, చూసినప్పుడు ఎన్నికగా

జ్ఞాపకం ఉంచుకోవలసిన పోలిక ఏమీ కనబడలేదు. ఇప్పుడు యిందాక గుడిదగ్గర చెట్టునీడను దిక్కులుచూస్తూ నిలుచున్న అతడు అని పోల్చుకున్నాను.

ఆవాలకంలో యాచనకు ముందు నడచే దైన్యం నాకు గోచరించింది. కాని ఎందుచేతనో, జేబులో కానీకోసం చిల్లరలో తడిమే చెయ్యి అలా అక్కడే తటపటాయిస్తూంది. మామూలు బిచ్చగానిలాగా ఆతనికి ధర్మం చేయటానికి, చెయ్యి తెమిలిరాలేదు.

'ఏమి'టని ప్రశ్నగా తలకొంచెం కదలించాను. అతడు అభిమానం చంపుకుని యింకొకరి యెదుట చేయి జాపవలసినందుకు తాను లోలోపల అణచుకోలేని బాధ అక్షరమక్షరంలోనూ తనకు మితిమీరిపోగా కనబరచాడు.

అంతా విని అయ్యో పాపం అనుకున్నాను.

భార్య ఇప్పుడో ఇంకో నిమిషానికో ప్రసవించుతుంది, చూసేదిక్కు లేదు. ఉండేందుకు చోటులేదు. ఆస్పత్రికి తీసుకువెళ్ళాలి. అందుకు వద్ద కానీ అయినాలేదు. ఎప్పుడూ ఎవరినీ అడిగినవాడుకాదు. అడిగితే అవతలవాడు లేదు పొమ్మంటే అప్పుడు తల తీసేసినట్లవుతుంది. అందుకోసమని ఏమీ పాలుబోక ఎవరన్నా దేవుడల్లే కనబడి యీ ఆపద అడ్డుకోలేకపోతాడా, దైవం తనపాలిట ఉండదా అనే ధైర్యంతో దైన్యంతో అక్కడ యిందాక నేను చూచినచోట ఎంతసేపటినుంచో నిలుచుని ఉన్నాడు. నన్ను చూడగానే అదివరకు నా మొగమైనా ఎరుగకపోయినా ఎందుకో ప్రాణం

లేచివచ్చింది, తగని ధైర్యం వచ్చింది. తాను ఇక్కడ ఇలా తిప్పలు పడుతూంటే అక్కడ ఆ పిల్ల పాపం ఏమయిందో!

అతనికళ్లు నీళ్ళతో నిండిపోయినవి. తుడుచుకునేందుకని పిడికిలిపట్టి ఎత్తిన చేతులను పట్టుకుని గుప్పిట విడదీసి నా పర్సుతీసి అందించి, వెళుతూన్న జట్కాను నిలవేసి అందులో ఎక్కించి పంపించివేశాను.

'నేను చేసినది నా తాహతుకు ఓ ఘనకార్యం కాదు. కాని పనికి ఏచాయలనూ పోలికలేని సంతోషం నన్ను ముంచెత్తింది. అతని ఆపదలకు అడ్డుపడగల కలిమి మా పెద్దల పుణ్యాన నాకు పుట్టుకతో అబ్బినందుకు అప్పుడు వారందరికీ మనసులో నమస్కరించాను.

'నేను ఇచ్చిన తృణమోపణమో ఆతనికి పుష్కలంగా చాలును. ఆ పిల్లది సుఖంగా రాజాంగంగా పురుడుపోసుకుని ఆమీద నాలుగు నెలలపాటు దేనికీ వెదుక్కోకుండా వాళ్ళందరూ గడపవచ్చును. ఆపదలు ఎప్పుడూ కాపురాలు చేయవు కదా? ఆత డెల్లకాలమూ యీ తీరుననే ఉంటాడా? ఏదన్నా కలిసిరాదా! యీలోపున ఏమో ముందు ఏది ఎలా జరుగవలసిఉన్నా యిప్పుడికేమీ ఫరవాలేదు. ఆ దంపతులు ఇక ఎప్పుడూ దీపం పెట్టుకుని నన్ను తలచుకుంటారు. నేనుచేసింది అది అంతా నాకు ఘనకార్యం కాకపోయినా అదేవాళ్ళకు మేరుపర్వతం. ఎన్నడన్నా మళ్ళా ఆతడు కనబడితే అప్పటికి మంచి స్థితిలో ఉండి...తప్పక ఉంటాడు. ఎప్పుడు యిలాగే ఉంటాడా?...నన్ను ఆకాశానికి ఎత్తిపట్టి హంగామాచేస్తే

ఆలాటి వేమీ నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేవు...యిరకట పడి...సరే అందాకా వచ్చినప్పుడు చూసుకోవచ్చును. ఇవాళమటుకు లేచినవేళ చాలామంచిది.

నడుస్తూంటే నాలో ఈ ఊహలన్నీ గిరగిర తిరుగుతున్నాయి. ఉత్సాహం హెచ్చిపోతూ అడుగు ఊతంగా పడుతూంది. ఆ రాత్రి బ్రహ్మానందంగా నిద్రపోయినాను.

—మెయిలు వేళకు రాలేదు. అందులో వస్తున్నానని టెలిగ్రాం యిచ్చిన మావాడు రాలేదు. కలుసుకునేందుకు వెళ్లకపోతే యేమనుకుంటాడో, రాకరాక వస్తున్నాడని, మామూలుకన్న తగనిపెందరాళే లేచి వేగిరం నీమా జామా వేసుకుని వచ్చి పడిగాపులు కాసిన చిరాకుతో బాటు బయట అప్పుడే ఎండ చురచుర మంటూంది.

గొంతు తడుపుకుని ఇక ఆమీద కార్యక్రమం ఆలోచించవచ్చును గదా అని ఆర్ ఆర్ లోపలికి వెళ్ళాను.

—బల్లకు ఆవలివేపున నాకు ఎదురుగుండా కుర్చీలో జారగిలపడి సిగరెట్ పట్టిన చెయ్యి వేలంటా జారవిడిచి మత్తుగా కళ్లు మూసి మూయనట్లుగా అతను కనపడ్డాడు.

మనిషిని పోలిన మనిషని మొదట వింతగా ఆవేపు చూశాను. మళ్లా చూడగా అవునేమో అని అనుమానం వేసింది. అయినా రూఢిచేసుకో లేదు. మనసులో అతడు ఇలా రావడానికి ఏలా...కలలోఅయినా తలచలేని సంగతి.

ఆలోచన తెగకపోయినా అతని ఎదుట కుర్చీలో కూర్చుని పరకాయించకుండా ఓ కంట కనిపెడుతూ, బీర్

ఒక్కొక్క పట్టు పడుతూ, సిగరెట్ గుక్కలాగుతూ తెగించి చూసి తేల్చుకోలేకపోతూ నాలో నేను తికమక పడుతున్నా నే. కాని విడవకుండా చూస్తూనేఉన్నాను.

నన్ను చూసి మొగం అదోలాగో చేసుకుని పలుక రింతగా చిరునవ్వు తెప్పించుకుంటూ లేచి సాఫీగా కూర్చు న్నాడు.

"మీరు బైబిల్ చదువుకున్నారా ?"

—ప్రశ్న అంతా అర్థమయి మెదడుకు పట్టేలోగానే 'అవును' కనుక ఆలాగున తల ఊపాను.

"డేవిడ్ ఏంచేశాడు? జ్ఞాపకముందా?"

...ఏం చేశాడు? యుద్ధాలు చేశాడు. ఎదురించిన వాళ్ళతో నల్లా ఎంతమందినో చేసుకున్నాడు. ఇంకా...మరి ఊహుఁ...చదివినదంతా మళ్ళా నెమరుకు తెచ్చుకుంటున్నా. ఆతడు అడిగినదానికి సరిపోయే జవాబు దొరకడంలేదు. అదీ అర్థంకాక ఆతని ఆ నడవడీ అర్థంకాక నాచేతగాని ఉడుకు మోతుతనము, అరికాలిమంటను రెచ్చగొట్టి నెత్తికెక్కిస్తూ న్నది.

పట్టుకుని, ఛడామ్మడా దులుపుదామనుకున్నాను నోరు చేసుకుని.

'ఏంచేశాడు ఆ కొడుకు అలా చచ్చిపోయినప్పుడు?'

మబ్బు విడిపోయినట్టుగా కొట్టిచెప్పినట్టు అర్థమయింది. కాని, హరిహరీ ఆతనికంత అన్యాయం జరుగరాదు. నాదానం పనికిమాలినది కారాదు.

గుండె తరుక్కుపోతూంది. అతన్ని చూడగా, అతను అవునని బరువుగా తల ఊగించాడు;- పాపం, బ్రతికించుకో లేకపోయినాడు. ఎంద రెన్నివిధాల సాయపడితేనేం తా నొకటి తలచినా దైవ మింకోటి తలచాడు. అది చూడలేక అక్కడ ఉండలేక అందుకు కావలసినదంతా అక్కడివాళ్ళకు యిచ్చి...

ఆమెకోసమేకదా, రక్షించుకుందామనేకదా, కలసి ఎన్నటికైనా కష్టాలు మరచిపోయి, సుఖపడలేమా అనేకదా ఎన్ని అగచాట్లుపడినా ఆమె లేకపోయిన తరువాత ఇక తనకు ఏంకావాలి! ఏ దైవమూ అడ్డుపడలేదు. పడడు. కావలసిన కారణార్థం అలా ఉండగా ఎవరికర్మకు ఎవరు కర్తలు?

అంత దారుణం జరగడం, నిజంగా అతని విషయంలో చాలా అన్యాయం. ఇచ్చిన దేవుడు పది కాలాలపాటూ ఎందుకు మరచిపోలేడూ? ఆలాటివాళ్ళకు అదే పదివేలే, కడుపు మాడుతూన్నా కష్టమూ నిష్ఠురమూ కలసి అనుభవించడానికైనా నోచుకోనందుకు ఆత డిది అంతా ఏనాడు చేసిన పాపమో!

త్రాగనీ, అంతకన్న అతడు చేసేదిలేదు. త్రాగి తనను తాను మరచిపోలేకపోతే, తనకు తాను దక్కడు, ఎవడైనా ఆపదలు తలకు మీరినప్పుడు.

ఆతనిని నా అతిథినిగా చేసుకుని అదమరచేటట్టు ఆరగా ఆరగా ఎక్కసమై భరాయించుకోలేనంతదాకా త్రావించాను కైపు మోపవుతున్నకొద్దీ ఆతని ముఖంలోకి

కళాకాంతులు వస్తూన్నవి, చాలా పై స్థాయిలోకి వెళ్ళి పోయినాడు.

వెళ్లిపోదామా అని అడిగి అక్కడనుంచి నాతోబాటు లేచి గంభీరంగా వెంటనడుస్తున్నాడు; ఇంటికి తీసుకువెళు దామా అనుకున్నాను. ఎవరైతేనేం? ఏమో అతన్ని చూచిన కొద్దీ ఏలాగైనా నాశక్తిలో ఉన్నంతవరకూ ఎంత సాహాయ్యమైనా చేయదలచుకున్నాను. మన తాహతుకు, లోకాన్నంతా బాగుచేయలేం కాని ఒక్క జీవుడిని కష్టందాటేటంత వరకూ కనిపెట్టలేమా లేకపోతే ఎందుకువచ్చిన సంపద?

వెళ్లిపోతానన్నాడు, నాతో కొంతదూరం వచ్చి. నే నేమి అనలేదు. అలాటి స్థితిలో ఆపడంకూడా భావ్యం కాదు. ఎవరూ లేనిచోటికి ఎక్కడికో పోయి ఏకాకి ... ఏడ్చి ఏడ్చి—అవును అంతే యేసురాయడనినట్లు ఎవరి సిలువ వారు మోయవలసిందే. తోడుపట్ట వీలులేదు. తలబరువు. కలిసి, తోడునడిచినా అడుగులకు అడ్డమేకాని అంతకు మించిన లాభం ఏమీలేదు.

సరే నన్నాను కలిగినది కాస్తో కూస్తో యిచ్చి. నే నెవరినో చెప్పి, ఎప్పుడే వేళనైనా అవసరం వచ్చినప్పుడు ఏమీ అనుకోకుండా నా దగ్గరకు రావచ్చునన్నాను. పరాయివాడినని బిడియపడక సొంతవానిగా చూచుకోమన్నాను. మళ్లా ఎప్పుడు కనబడుతాడా అని ఎదురుచూస్తూ ఉంటాను. ఎప్పుడూ ఏలా ఉంటున్నాడో అని తలచుకుంటూ ఉంటానన్నాను. పోయి రమ్మన్నాను.

—ఏమిటో మనసు పరిపరివిధాల వెర్రిగా వేదాంతం లోకి పోయి చెడుగుడాడుతూంది. అవును, లోకంలో యింత దుఃఖం పేరుకుపోయి ఉందని తెలిసేటప్పటికే కాదూ అమాంతం బుద్ధుడికి దిమ్మ తిరిగిపోయింది? అతడు అవతార మూర్తి గనుక అప్పటినుంచీ అన్నీ వదులుకుని లోకాన్ని దాన్నుంచెలా వదిలించడమా అనే ధ్యాసలో పడిపోయినాడు. మనలాటివాళ్లు ప్రాకృతులు ఆ క్షణానే ఆ ఆలోచనలుకాని యింకోదాంట్లో పడగానే అదంతా మరచిపోతారు. అంతే. అందరూ అందలం ఎక్కడానికి ఆస్కారం ఉందా?

అనుకోకముందే నేననుకోనిచోట ఆతను మళ్లా తగిలాడు. సినీమాకు సాయంకాలము మొదటి ఆటకు వెళ్ళి అనుకున్నంతకు రెట్టింపు పొద్దుగై చాలా పొద్దుపోవడంచేత అడ్డదోవ పట్టాను.

ఆ వీథిని నేను ఎన్నడూ సాధ్యమైనంతవరకూ వెళ్లను. అక్కడ నాలాటి మెత్తనివానికి అడుగడుగుకీ హంసపాదులు తగిలే భయండున్నది. ఏమీ లేకపోయినా, ఎవరన్నా చూస్తే ఎన్నివిధాలైనా అనుకుంటారు. చచ్చు చవకబారు సాని కూటం. నాలాటివాడు పరాకున అయినా ఆ చాయలకు పోరాదు.

నేను అక్కడకు అడుగువేసేటప్పటికి అతడూ సరిగా ఆ గుమ్మం గబగబా దిగి సిగరెట్ చివరదమ్ములాగి విసిరేసి నన్నుచూసి నిలిచిపోయినాడు. నాకు పలుకరించడానికి కృత్యాద్యవస్థ అయి ఆతని కంటబడటం మహాపరాధంక్రింద

కట్టుకుని యిరకాటంలో పడ్డాను, ఎటు మెసలడానికీ వీలు లేక.

'రండి పోదాం' అని చనవుచూపి చేయిపట్టుకుని అడుగువేయించాడు. వెనుకనుంచి యిందాకటి తలుపు తెరచిన కిరై 9, 'వెళ్ళిపోతున్నారా' అంటూ కొంచెం బొంగురుగా ఆడగొంతు పలికింది. 'ఆఁ' అని వీధంతా మారుమ్రోగే లాగు తల త్రిప్పకుండా వెనుకకు జవాబు విసిరాడు. 'ఇంకా కొంచెంసేపుండి పోతానన్నారు కాదండీ' అని నిలవేసే గదమాయింపుతో ఆ తెల్లచీర మెట్లుదిగి నన్నుచూసి సంకోచంతో నిలిచిపోయింది. నాకు కంపరం ఎత్తుకువచ్చింది. చిన్నతనం వదలక ముందు ఒకసారి యీ త్రోవనే పోతూంటే పట్టపగలు నట్టనడి వీధులో నుంచుని అదెవతో ... దండు సిపాయిలాగుంది.

'మా యింటికి రావయ్యా పంతులూ, అని చెయి పట్టుకుంది. నాకు ముచ్చెమటలుపోసి ఎలాగో విదిలించు కుని తిరిగన్నా చూడకుండా ఒక్క టేపరుగు! అంటే ఇంతకూ నేనేం మహామడిగట్టుకున్నానని చెప్పడానికి కాదు. ఏదో సంసారపక్షంగా ఎన్నడన్నా బుద్ధి మళ్ళినప్పుడు ఎన్ని మీన మేషాలో లెక్కచూసి, ఎన్నివరాలో కోరుకుని, ఎక్కడో అన్నివిధాలా మనకు సదుపాయం ఉన్నచోట; అంతే. నూటికీ కోటికేగాని చప్పున ఎక్కడబడితే అక్కడ జొరబడి హైరానయే కరకుతనంలేదు.

పంచతంత్రంలోనో దేన్లోనో పులి మ్రింగడానికి గిలి వస్తూందంటే, కాలికి అంటగట్టుకునిఉన్న నక్కను యీడ్చుకుంటూ తోక ఝాడించిందని చదివానే. దానికి ప్రతిగా నడిచింది ఆ రంగం. ఏనుగంతసత్తువ తెచ్చుకుని ఆతని చేయి విడవకుండా లాక్కుంటూ పోయి రాజవీధిలో పడ్డానో పరమాత్ముడి కెరుక !

ఆయాసం తీరుతూండేసరికి వేడెక్కిన మెదడు పని చేయడం మొదలుపెట్టింది మళ్లా.

అవునుపాపం! మానవుడే అతనేం దేవుడా ? అయినా దేవతలన్నా భరించలేని బాధలకు తల ఒగ్గినాడు. ఆ పూట తింటే మరోపూట ఉండీలేకుండా ఆ అవస్థలో భార్యకు నెల మసలడం...సరే...యిటీవల జరిగిన ఘోరం...ఏదీ, అతనికి ఆ మాట అనుకునేందుకైనా అవకాశం ? ఎంత మనసు నీరైపోయినా దేని తాపత్రయందానికి. పాడుశరీరం చెప్పినమాట వింటుందా! ఎంత మొగం వాచిపోయినాడో; నేను శకునపక్షిలాగా అక్కడ తయారుకాకబోతే తిరిగి లోపలికి బలవంతం చేసి అయినా లాక్కుపోయేది. తప్పక వెళ్లేవాడు. సిద్ధాన్నం చెడగొట్టాను. చెడగొట్టానా నేను ? ఒకవేళ, పైసా ఖాళీ అయిపోయి అందుకని వచ్చేశాడేమో ? ఆలాగైతే అది మన చేతులోఉన్న పనేగా.

పర్సుతీశాను జేబులోంచి. ఆతడు అంతలో ఆకలిగా ఉన్నదంటే సింగుకొట్టుమీదకు వెళ్లి మిఠాయి, టీ యిక రాత్రికి భోజనాపేక్ష అంటూ లేసంతగా గబగబ పుచ్చు

కొన్నాం. వచ్చి కోనేరుమెట్లమీద కూర్చుని చెరో సిగరెట్టూ ముట్టించాం.

'బ్రదర్ లోకంలో యింతమంది ఫూల్సు ఉంటారని నేను యిదివరకు ఎవరన్నా చెప్పినా నమ్మేవాడిని కాను.' ఎత్తుగడ నాకు ఎంతమాత్రమూ అర్థంకాకపోయినా, ఏమిటో ఆతడనేది, ముందైనా తెలుస్తుందికదా అని మాటకు, మాట వరుస కలిపాను. ఊరికే యింకొకటి: నా విషయంలో, విధేయత ఆ నిమిషందాకా చూపిస్తూన్నవాడల్లా అంతలో అంత చనువు తీసుకోవడం వెగటుకాకపోగా సరదాగా ఫీలయినాను, చాలా.

'ఎంతమంది ?'

'ఎందరో! కాని, అందరినీ మించిపోయినావు నీవు. నీ ముఖం ఎదుట నిన్ను పొగడటంకాదు, నిజం చెప్తున్నాను.'

ఏమిటి, ఆతనికి యిన్ని బెడదలూ చాలక మతికూడా చలించిందా? అనుకున్నాను. ఆతని నేమనడానికి నోరు రాలేదు. ఆతని నోరు మూతపడలేదు.

ఉన్నవాడిని ఉన్నట్టుండక యింత గ్రంథంలోకి ఎందుకు దిగానంటే అయిదారు రోజులక్రింద, నా అదృష్టవశమున 'వందేమాతరం' చూడటం తటస్థించింది. చూసినతరువాత పట్టభద్రుడు పని దొరక్క బస్తాల మోతలోకి దిగడం యిత్యాదులు మనవాళ్ళ మనసును ఎంతవరకూ ఊపుతాయీ అని ఆలోచించి తమాషాకోసం ఒక సంపన్నగృహస్థు దర్శనం

చేసి, సినీమాలో కథ అప్పటికి అవసరం ఉన్నంతవరకూ, మైనస్ సీసపద్యాలనుకో, 'మమ' అని ఆయన ఎదుట అతి జాలిగా అభినయించేసరికి ఆ మానవుడు పాపం టార్రై పోయి ... అతడూ గడచి బ్రతికినవాడేనట!... నన్ను ఆదరించి అంతో యింతో చేతులోపెట్టి ఎక్కడన్నా పని దొరికేవరకూ పొదుపుగాచూసి వాడుకుంటూండమనీ, ఎల్ల కాలమూ చీకటే ఉండదనీ ఎక్సెటరా కలగూరగా ఓ గంపెడు వేదాంతం నెత్తికెక్కించి సెలవిచ్చాడు. వెళ్లి పోతూ ... అన్యాయమేగాని ... ఆరిఫూలా! అని మనసులో ఆశీర్వదించాను. అలా అనిపించింది.

నన్నుచూశా...నా కథలో తొణికిన లోక దౌర్భాగ్య స్థితినిచూసా... లేక వెనుకటి తన బాధ తలుచుకునా...ఎది అతన్ని అంతగా కదలించింది ?

మొదట లేవుగాని కార్యంలోకి దిగేటప్పటికి యిన్ని రకాల సందేహాలు వేసినవి. భాణీ మారుద్దా మనుకున్నాను.

కాచుకు నిలుచున్నాను, వచ్చేపోయేవారి వాలక మంతా చూస్తూ, నీవు కనిపించావు. దొరికాడురా అని పథకం వేశాను. అది ఖచ్చితంగా పడ్డది. ఆపూట పర్సు ఖాళీ చేశావు. అవును. ఆడకూతురు అన్నివిధాలా ఆలాటి అవస్థలో ఉన్నదని అంతటికీ కారకుడైనవాడే ఎదుటబడి గుండె తరిగిపోయేటట్టు చెపుతూంటే 'అయ్యో ?' అని అను కోని గృహస్థు ఉంటాడా, ఏ తలకుమాసిన వాడోకాని? అందులో చూశానుకదా, నీ చేతికి ఎముకలేదు; అందుకనే

అందరినీ మించిన ఫూల్‌వు నీవు. లేకపోతే, ఏం అందరిలాటి మనిషినీ కానూ నేను? చదువుకుంటే, సత్కాలమువాడి లాగా కనబడితే, ఎక్కువేమన్నా జరిగిందా? దోవనపోయే ప్రతి బిచ్చగాడూ నిన్నిలా దోచుకుంటున్నాడా?

ఈ దెబ్బతో అసలైన ధర్మసూత్రం గోచరించింది. మనవల్ల మనవాళ్లు ఎంతబాధపడుతున్నారో కన్నులకు కట్టజేస్తే అప్పుడు మన దుర్దశకూ, మనకూ మరీ విలువ హెచ్చుతుంది. మన వాళ్ళకు, మనకు లోకైన ఛాయా అందుకుంటుంది.

అర్థం అయిందా!

'నాకు అర్థం అయిందికాని అంతటితో ఆ వ్యాసంగం చాలిద్దామనుకుంటే అడుగడుక్కీ నీవు తగలడం, నీ కోసం మళ్ళీ కథ పెంచడం, ఇలా అయితే నీ సత్తువ సన్నగిలేటప్పటికి నేను కాశీ మజిలీలను మించిన గ్రంథం నడపాలిసి వస్తుంది. ఇక ఇంతతో చాలిద్దాం...ఆడటానికి...నాకు ఓపికా లేదు, తీరుబడీ లేదు.'

న్యాయంగాపడితే...అప్పుడా పట్టున అతన్ని పట్టుకుని ఎగాదిగా చెక్కేయవలసింది...అంత కోపం రాకపోగా ఆ బాధలన్నీ అతడు పడలేదుగదా అని మనసు తెరిపిన పడ్డది. అయినా ఆ భావం ముఖంలో కనపడనీయకుండా 'అన్నీ అబద్ధాలేకదూ?' అని గదమాయించాను.

'నేను చెప్పినవి అన్నీ ఆహాః. అదే నేను యిందాకా మనవి చేస్తూన్నది, నీవు చూచినది అంతా...సరి...నిజమే కదా.'

'అయితే నేను చేసింది అంతా బూడిదలో పన్నీరు.'

'అది పన్నీరే. ఇది బూడిదకాదు గులిస్థాన్. నేను రాసేవన్నీ అబద్ధాలు కాదూ! . అందుకోసం అచ్చువేసుకునే వాళ్ళు అవన్నీ కళ్ళకద్దుకు తెలిసే కొనుక్కోవడంలేదూ? యిప్పుడు యింత ధర పలికించానంటే, అవును, యిది నీకే కాపీరైట్. అవునుగాని నీవు ఇంకొకటి కూడా, ఆలోచించు. నిజంగా నేను నీ దగ్గిరకువచ్చి...నేను ఎవరైతే నీకేం; నాకు సరదాగా ఖర్చు పెట్టుకునేందుకు డబ్బుకావాలి. అవసరం ఏమీ లేదుగాని ఊరికేనే తగలేయడంకోసం' అని యథార్థం చెపితే నీవు ఏమన్నా చోటు పెట్టేవాడివా? నీ చుట్టూ ఎన్ని సారులు తిరిగినా ఏగానీ అయినా రాలేదా? యిప్పుడుచూడు నీవు నే నేమైపోతానో ఏమో అని నా వెంటబడి ఎన్నివిధాల కనిపెట్టావు? అదే తేడా. కన్యాశుల్కంలో చెప్పినట్టు 'ఎంపికలో ఉంది.'—

ఆతడవు నన్నది కాదనగల తాహతు లేక, ఉడికిలి, రోషంతో.

'అంటే అందరూ నీ వనుకునేటంతటి ఫూల్సుకారు; కొందరికైనా, హృదయం ఎదుటివాళ్ళనుచూస్తే జాలి'.

'అవి అందరికీ నిజంగా ఉండాలి. సోదరా! కాని, ఉన్నవికదా అనే ఉబలాటం తీర్చుకునేందుకు ... ఒక్కటి

చెపుతా విను ... పలుపూ పందిలిగుంజా పడివున్నాయికదా, దైవం యిచ్చాడుకదా అని ఎవడన్నా వచ్చి దేవరతో దున్నపోతు యీనిందయ్యా! అంటే, వినేవినడంతోనే దూడను చూడకుండా కట్టేయమని చెప్పవద్దు. చెప్పావో, అలా చెప్పగా చెప్పగా పశువులు లేకపోవడంమాట అటుండగా పందిలిగుంజ సహితం నిరంతరం దానధారకు తట్టుకోలేక చీకిపోతుంది.'

ఫక్కున నవ్వాను. నవ్వక చేసేదేముంది.

'నవ్వావో, మాలాటి నాపచేలు పండుతవి.'

'పండినా మేము మీ దృష్టిలో ఫూల్సు మే'.

'ఫూల్సు పండినకొద్దీ మా పంట పండుతుంది. రైతు దేశమునకు వెన్నెముక వంటివాడని కిసాన్ సోదరు డొకడు సాయించాడు. మాలాటి సరదాలున్న కుఱ్ఱకుంకలకు మీవంటి ఫూల్స్ జీవకఱ్ఱలు. ఆదిలో తాళంకూడా కుదిరింది. చూశావూ మీరు యిలాగే ఉండక తప్పదు.

'ఇక కథ కంచి రైలందుకునేందుకు పరుగెత్తబోతూంది. నీ వింక మరలి నిజమందిరమునకుంజని అనేక దివ్యవర్షంబు లీరీతిన ప్రజాహితకార్యంబు లాచరించుచూ మనెదవు గాతమని గుడ్ బై. నేను లాడ్జికి వెళ్ళి స్నానంచేసి...పాడుమాటలాడినందుకు...రాత్రికి వెళ్ళిపోతాను. మళ్ళా మనసు తిరిగితే ఇంక ముందెన్నడైనా అదైనా నీ ముద్దు చెల్లించడానికే రావచ్చును. కాచుకో—?'

# శిక్షావల్లి

ఆ మనిషిని చూపించాడు. డాక్టరు : 'ఏమిటో యితడిలో లోపం చెప్పుకో చూదాము. జబ్బుగా ఉన్నా డంటావా? - సరి, అందుకోసం, నీ తెలివితేటలు ఏమీ వినియోగించ నక్కరలేదు: జీసస్ అన్నట్టు జబ్బుగా ఉన్న వాడే వైద్యు డెక్కడా అని వెదుక్కుంటూ వస్తాడు. ఎవడో, నీవంటి వజ్రకాయుడు తప్ప. నీవు తయారయేది, యిక్కడకు సిగరెట్లన్నీ ఊదేయడానికీ, టానిక్కుల్లో నీళ్లు కలుపుకు తాగటానికీ. సరిగాని ఏమిటో తేల్చు మరి నీ తడాఖా ఎందాకా ఉందో.'

చాలాసేపు నిదానించి చూశాను. ఏముందీ, పైకి, చాలా నీరసించి అతిఖాయిలాగా కనబడుతున్నాడు. వంట్లో సత్తువలేనందువల్ల మనస్సుకీ రవంత చాంచల్యం ఉండ

నచ్చును. రాత్రిళ్ళు నిద్రపట్టకపోవడం, ఉదయాది అశక్తత యీ గుణగణాలన్నీ అవలీలగా మనం ఊహించుకోవచ్చును.

'ఇక తమాయించవోయ్ సంతోషించాముగాని తెలివికి' అన్నాడు డాక్, మన పనస చాలాభాగం విని. 'నేను చెప్పనా, ఏమీ జబ్బులేదు' అన్నాడు. ఆ మాటకు నేను నవ్వాను.

'అయితే దున్నపోతులాగా ఉండాలిసిందే. మరి యిదంతా నీ మందుల ప్రభావమా ఏమిటి?'

'ముయ్యవోయ్ ఇక అంతటితో: దుక్కలాగా ఉంటే ఏమీ జబ్బులేదనీ, చిక్కి శల్యమైతే ఏదో మునిగిందనీ అవన్నీ నీ మూఢ నమ్మకాలుగాని శాస్త్రం ఒప్పుకోదు. ఈతడికి జబ్బు చేయించకపోతే అసలు కుదర్చడానికి ధన్వంతరి తరమైనా కాదు.'

'చిత్రంగా ఉంది. కాని నమ్ముతాను; నీవు వైద్యంలో అబద్ధాలు ఆడవని నాకు ఆ నమ్మకం ఇంకా పోకుండా ఉంది. ఎందుచేతనో ఇంతవరకూ నీతోటివారి నందరినీ చూస్తున్నా.'

'షేక్...నీవు మెచ్చి మేకతోలు కప్పితే, ఇప్పుడు మనకు క్రొత్తగా ఒరిగేది లేదుగాని విను.'

నిరుడు యీ వేసంగిలో ఇతడు భార్యను నాకు చూపించడానికని తీసుకువచ్చాడు. అప్పటి కప్పుడే ఆమె చాలా వరకు చెదలట్టిపోయింది. ఒక టేమిటి, స్వరకర్తలందరూ ఝుంమ్ అంటున్నారు. లేనిది లేదు.

'నేను ఆరేళ్ళాయె ప్రాక్టీసు మొదలుపెట్టి. అదే చూడటం. అలాటి అనంతగుణ సంపూర్ణురాలిని. ఆరని అగ్ని హోత్రం, ఛాయీ నిలువెల్లా.'

సరే చికిత్సకు ఒప్పుకున్నాను. ఇక్కడే నర్సింగ్‌కు అన్ని వసతులూ ఉన్నవి గనుక.

'ఈతడూ ఇక్కడేపడి ఉండేవాడు. ఇంటిదగ్గిర ఎవ్వరూ లేరటలే, భోజనం నాతోపాటూ హోటలునుంచి తెప్పించే వాడిని. ఆమెకు కావలసిన ధారకం ఏదో తయారుచేసి ఇచ్చే వాళ్ళమనుకో. ఆగదిలోకి తొంగిచూడ నన్నా చూసేవాడు కాదు. ఇక్కడఉన్న పత్రికలూ, పుస్తకాలూ ఓపిక ఉన్నంత సేపూ చదువుకోవడం, లేనప్పుడు నిద్రపోవడం, అదీ రాన ప్పుడు తనలో తాను ఏదో బిగ్గరగా గొణుక్కోవడం.

'ఎంత వైద్యుణ్ణయినా నేనూ మనిషినే కదా. నాకూ జాలీ దయా యిలాటివన్నీ అంతో యింతో ఉన్నాయికదా. సాటివాడు అలా బాధపడుతూంటే.

అవును, అలాగే అనుకున్నాను. ఎంతలో చచ్చిపడి ఉన్నవాడైనా, ఒకప్పుడు కాకపోతే ఒకప్పు డనిపించదూ. చేసుకున్న పెళ్లామూ అలా అయి...అంత చెడిపోయి... అదంతా చేతకానితనంవల్ల వచ్చిందనుకున్నా, అనుకోమా మరీ ! అనుకుని క్రుంగిపోడూ, అది సహజమే కదా ?

అలాటప్పుడు మనమేమీ, అవును, కాదూ అని, జోక్యం కలిగించుకోకూడదు. మానవప్రకృతికి అలవిమీరిన

ఉద్రేకం తాండవించేటప్పుడు ఎటు రవంత బెసిగినా మార ణమే. దానంతట దానినే తగ్గిపోనియ్యాలి, అది మంచిది.

నేను వింటూ వినిపించుకోకుండా పోనీ పాపం ఏదో మనసులో దుర్ధకొద్దీ అలా తపిస్తున్నాడు అని నా పని నేను చేసుకుపోతూ అతనితో ఆట్టే అనవసర జోక్యం కలిగించుకో కుండా ఉండేవాడిని. విన్నవే వినడం...ఒకరోజు కాదు, రెండురోజులు కాదు. రోజూ అదేపాట అయేసరికి తిరుమలే శుని ప్రశ్నించాలిసిన స్థితిలో పడ్డాను. వినగా వినగా సంత చెప్పుకున్నట్టుగా ఆకాండ అంతా నోటికి వచ్చేసింది.

'ఈ కేసు ప్రత్యేకం శ్రద్ధతో ఆదినుంచీ గమనించుతూ అన్ని విషయాలు వ్రాసి ఉంచుతున్నాను. ఆ భాగం చదువు తాను ఉండు. అది ఆలుమగల సరాగం. నీ వొక్కటి గమ నించాలి. కవ్వించి కజ్జాలోకి దించుతూన్నది మగవాడు; కస్సుమంటూ లేచి కాల్చినట్టుగా వచ్చే జవాబులు యిల్లాలువి.

'నేను ఊరుకోను.'

'సరే.'

'కనుచీకటి అయినా పడకముందే పట్టపగలే నీవు, అల్లా కలకలలాడుతూ, కులుకుతూ. కిటికీదగ్గర నిలుచుని ఓరగా కోరచూపులు విసురుతూంటే, లోకులు ఏమను కుంటారు ?'

'—ఏమనుకుంటారు ? ఆ అమ్మాయి ఎవరో అసాధ్యు రాలల్లే ఉంది. కళ్ళతో, కనబడి దారినపోయే ప్రతి మగవా

డినీ కబళించివేదామన్నంత ఆశతో చూస్తూంటుంది అని అనుకుంటారు. అనుభవం ఉన్నవాళ్ళయితే, జాలిపడతారు.'

'అలాగేం-'

'ఊఁ:-పాపం, అవును మరి, అయిదో పెళ్ళివాడో లేక ఇంకా అంతకన్నా అధమస్తుడో అయిఉండాలి; కాకపోతే ఎందుకలా, పడుచుది బరితెగి ఊరుమీద విరుచుకుపడుతుంది? అని జాలిపడరూ.''

'పడి—?'

'సడీ చప్పుడూ లేకుండా సాగిపోయే సంసారం కాదిది అని, కొంచెం చొరవగా, కదిలించి చూద్దామని ఉబలాట పడతారు.'

'మరి ఇక నే నెందుకూ?'

'ఆ సంగతి వాళ్ళకు ఎందుకూ?'

[పైన ప్రశ్నా, జవాబూ సాధారణంగా, రెండు మూడు ఆవృతు లనుకుంటాడు. గబగబా కొంతసేపు తరువాత మౌనంగాఉండి క్రమంగా గొంతుగుడిలోకి దిగి, అది హెచ్చి మళ్లామాటలు ఇవి, మొదటి భాగంకన్న కొంచెం పైస్థాయిలో అంటాడు.]

'నేను ఇక సహించను'

'—మీ ఇష్టము, నేను మీ మాటకు దేనికీ అడ్డు చెప్పను.'

'అలా అంటూనే ఇంతదాకా తెచ్చావు.'

'మీరన్నంతదాకా వస్తే ఎంత బావుండును? నాకు తరం కావడంలేదు. మీరు చూస్తూనే ఉన్నారుకదా?'

'కళ్ళు ఉన్నందుకు అవును. ఇదీ ఫలం!'

'నాకు అంతకన్న ఎక్కువ ఒరిగిందేమున్నదీ? కాయలు కాచేటట్టుగా చూసి మొగం వాచినా మాత్రం, ఫలించందే! తలవాకిలి ఇల్లుగా ఉంటూన్నా, దైవానికి దయరాదు.'

'నీకు తోడు దైవం కూడాను.!'

'అందుకే, నేను కలవరించేది!'

'ఎవరి కోసం?'

'చూడలేదా మీరు, మన వీధి చివర మేడమీద ఇవతలి గదిలో ఉంటాడు. చూడండి. ఆ గిరజాల పిల్లవాడు, వంచినతల ఎత్తకుండా పోతాడు. అదేం పాపమండీ, ఎన్న డన్నా కన్నెత్తి నావంక చూస్తాడేమోనని-కాచుకుని ఉంటే-'

'ఇక - నీవు నోరెత్తితే, నీవు-నోరెత్తితే-'

'అవును నోరెత్తినా ఏం ప్రయోజనం? నాతో శ్రుతి కలిపి అందుకునేవారు లేనప్పుడు. నిజమేలెండి, అయినా, మిమ్మల్ని అనడం ఎందుకు?-'

'అదిమాత్రం మిగిలిందా' ఇదంతా ఆ ముచ్చటేకదూ? ఇంతకూ నేను బ్రతకడం నీకు కంటకంగా ఉంది. అంతేకాదూ?'

'లేదండీ, ఎంతబట్టువేయమన్నా వేసుకుంటాను. ఎంతో హాయిగా ఉంది.'

'అవును: అనుకూలంగా—'

'ఏమన్నా అనుకోండి, అదృష్టానికి కర్తలు మీరు. మీ కళ్లఎదుటనే నే నిలా చల్‌చలావుగా వుండటం నిజంగా నమ్మండి, నమ్మకపోండి. అప్పుడుకూడా మిమ్మల్నే తలచుకుని అంతా మీ దయే అనుకుంటాను.'

ఇదోయ్ అతడు రోజూ అప్పగించే పాఠం.

'ఇందులో అర్థంకానిది ఏముంది? తేటతెలుగులో మాటూ మర్మమూ లేకుండా ఢంకామీద మ్రోగినట్లుగా నడుస్తూంటే అతడు అర్భకుడు, ఆ అమ్మాయి పరమ రేచు. అందుకనే వెనుకటి సామెతగా చెప్పి చెప్పి మరీ చెప్పినంతా చేసింది. అడ్డంపడటానికి ఆ ప్రవాహం ముందర ఆతడు లెక్కా జమా? ఎంత గ్రంథం జరిగిందో? ఆ భోగట్టా మనకు తెలియకపోయినా, ఆ అమ్మాయిని చూసిన తరువాత ఆ వ్రతం శక్తివంచన లేకుండా పట్టి పల్లార్చిందని స్పష్ట పడాతూంటేను!'

అవునా యిదంతా అసలు కథకు పూర్వరంగం అనుకో: ఆ పిల్లది సకలాభరణభూషితురాలై మన దగ్గిరకు మరమ్మ తుకు వచ్చిందన్నంతవరకే నీవు ప్రస్తుతం గ్రహించవలసింది. అంతకుమించిన అర్థం ఆలోచించివాలంటే ముఖ్యవిష యాలు అతకవు.

నీవు అనుకుంటూన్న ధోరణికాదులే విను.

అప్పటినుంచీ జరిగిన నాటకంలో మనకూ భాగ మున్నది. మన సమక్షానే నడిచింది గనుక తేదీలవారీగా

పుస్తకం తిరగవేయకుండానే ఏనాడేమైందో చెప్పగలను. గాని అదంతా, తడిసి మోపెడవుతుంది. టూకీగా —

మందు ప్రాకులవల్ల మళ్లా మామూలుమనిషి కావడానికి ఆ అమ్మాయిలో కొన్ని భాగాలు పూర్తిగా దుష్టములై పోయినవి. అందువల్ల కత్తి పట్టవలసివచ్చింది. ఆపరేషనులో అనేక తికమక లున్నాయి. అంతపని మన ప్రాంతాల్లో, ఎవడికీ చేయడానికి చేతులాడవు. నేనూ మొదట తటపటాయించాను కాని చివరికి తెగించి ఎలైనా మా బాగేకదా అనుకుని చొరవచేశాను. చేసినందుకు అది నెరవేరింది.

నేనేం అందరికన్నా మహా పొడిచేశాను అని నీముందు గొప్ప చెప్పుకోవడం కాదు; ఆ వేళావిశేషం అటువంటిది. అదే ఇంకొకప్పుడై ఆ అమ్మాయికాక యింకొకరైతే నాకూ చేతులు చప్పబడేవేమో! ఏమో యింతకూ ఆమె అదృష్టవంతురాలు. గడచి బ్రతికింది.

అదిగో, అక్కడే, నేనూ పొరబడినది. అది తెలుసుకునేసరికి నేనూ ఇంకా పెరటిదోవనే ఉన్నానని లోలో నేను పొగడుకుని ఉబ్బిపోతూన్న నా తెలివితేటలే నెత్తికెక్కి నన్ను వెక్కిరించినవి.

ఏమైందనుకున్నావు! ఆమెకు కొంచెం నిమ్మళించిన తరువాత ఒకనాడు ఆతనిని పిలువమంది. అంతవరకూ తొంగి చూసి ఊరుకోవడమే కాని ఎన్నడూ లోపలికి అడుగుపెట్టే వాడు కాదని యిందాక చెప్పానుకాదూ.

ఇద్దరూ ఒకరినొకరు అన్ని రోజులకు అంత దగ్గిరగా అదే చూసుకోవడం. అక్కడ నేనూ ఉన్నాను. అవతలకు వెళ్లిపోదామనుకుంటే ఆమె ఉంటేకాని వీలులేదనీ, ఉన్నందు వల్ల ఫరవా ఏమీలేదనీ నిలిపివేసింది.

ఇదోయ్ ఆమె అతన్ని పలుకరించడం 'ఇక మీరు ఎలా బ్రతుకుతారండీ.'

విని నే నేమనుకోవాలి? మనసు పరిపరివిధాలయి పోయింది. అతడూ తెల్లమొగంవేసి విని, తలవంచుకుని ఊరుకున్నాడు. ఆ అమ్మాయి అంతటితో ఆగలేదు.

'అవునండీ నాకు అదే దిగులుగా ఉన్నదండీ! నేను బ్రతికాను, బట్ట కడతానన్న మాటేకాని నేను ఇక ఉన్నా, లేనిదానిలోనే జత. నా మాట అబద్ధమనుకుంటే పోనీ డాక్టరుగారిని అడగండి. నేను ఆకారానికే కాని, అంతే నండీ, అయ్యో మీరు?'

అయ్యో పాపం అని అనుకున్నానేకాని, ఆ మాట మీదనుంచి వచ్చిన మామూలు ఆలోచనలో అనుమానం వేసింది. అంత అనురాగముకలదే అయి అతని క్షేమానికి అంత ఆదుర్దాపడే మనిషే అయితే అందాకా రావడం ఎందుకు కలుగుతుంది? లేక యిప్పుడు వస్తూన్న బుద్ధా? అయినా అంత విషమ యాతనకే తట్టుకుని భార్యను ఎన్నడూ పల్లెత్తి ఏమీ అనని ఆ త్యాగమూర్తి ఆమె మళ్లా తన కళ్ళ యెదుట కనబడుతూన్నందుకే యేనుగు నెక్కినంత సంతోషించి ఊరుకుంటాడుగాని ఆమెతో కాపురం కరవైందని ఉరి

పెట్టుకునేందుకు దిగేవాడే అయితే యిన్నాళ్లూ యింతకు పూర్వం అఘోరించిందేమిటి? అలాంటి దిమ్మరిని కట్టుకుని... ఉహు...ఆ ఊహా సరిఅయినదికాదు.

ఆమె యింకా చెపుతూనే ఉన్నది. అతడలా ఆల కిస్తూనే ఉన్నాడు.

'నాకు ఇదివరకు ఇంతగా విడమరిచి చెప్పేటంత తెలివి లేకపోయింది. కాని ఇన్నాళ్లూ ఇదే ఆలోచనవమో ఇప్పటికి తెలిసివచ్చిందండీ, నా సంగతీ, మీ సంగతీ; బిడియపడకండి. మనం ఏనాడో చేసుకున్న పాపం కాకపోతే అందిరిలాగానే మనమూ అమ్మకడుపున పుట్టామేకాని, హఠాత్తుగా ఎక్కడ నుంచో ఊడిపడలేదుకదా? అందరిలాగా బ్రతకలేమని, మన మేమైనా బ్రహ్మతో మొరబెట్టుకున్నామా? అందిరిలాగా ఎందుకు లేమూ?

'అవునండీ...అనుభవించుతూన్నదేనా మనం. ఇప్పుడు కాదంటే ఏమన్నా-పోతుంది గనుకనా? భార్య పసులను ఆశించి భ్రష్టురాలవడం చూస్తూ ఆ బాధ అహర్నిశలూ పడు తూంటేనేగాని, పతివ్రత అయిన పాపానపోతే మీకు బ్రతుకు కరవౌతుంది. అది మీ ప్రకృతి. నేనో మననులో ఏమీ పాడు కోరికలు లేకపోయినా, శరీరం ఎంతమాత్రమూ నేను చెప్పినమాట వినదు. దానికి విడవకుండా నూతన అనుభ వాలు లేనిదే అది నిలువదు. దానిని ఆపడం నా వశంలో లేదు.

'అంతేనండీ...యీ జన్మానికి ఇక మగవానికీ నాకు - జిలాయి! అయినా మొంఢికిపడి మోడునై ఏదో విధంగా

రోజులు వెళ్ళబుచ్చుతాను. కాని బాధపెట్టలేనే, ఏలా బ్రతికించుకుంటానా మిమ్మల్ని అని అదే దిగులు.'

అంటూ ఎంతసేపో విలపించిందోయ్.

అదీకథ.

"నీవూ బ్లాఖ్, ఎబింగ్ అవన్నీ చదివినవాడవేకదా, ఎల్లిస్‌తో బాటు అందుకున్నావుకాదూ ?"

'అందుకు మనం ఏంచేయగలం ?'

అయినా చేయగలిగిందంతా చేశాను; ఆమె ఆఆలోచన మానేటట్టు చేయలేక పోయినాను. మనసును. . .ఏమైతేనేమి లే బ్రతికించలేక పోయినాను; ఆ నిరాశే ఆమెను తినేసింది.

ఆమె పోయింది నా తెలివితక్కువవల్లనే అనుకో; అంతకన్న బెడద ఇది; ఈతని సంగతేమిటి ? ఎటూతోచలేదు. తపనఎత్తి కొట్టుకున్నాను. పుస్తకాలు ఎన్ని సారులు తిరుగవేసి చూసినా అందులోఏమిటి కనబడేది నా మొగం ?

మళ్ళా మొదటికి వచ్చాను.

ఎక్కడ బండి త్రోవ తప్పిందో, తెలుసుకోవద్దూ ? అన్నిత్రోవలూ వెదకి చూశాను; తోసేశాను.

ప్రకృతికి ఎదురీతగా బ్రతికేతత్త్వం మనసుకూ, దేహానికీ ఒకదానికొకటి తీసిపోని స్వాతంత్ర్యాన్ని ఆలవరుస్తుంది. అది నిలవకపోతే అప్పుడా మనిషి గల్లంతు. అంటే ఇంకా విశదంగా చెపుతాను. ఆ అమ్మాయి ఉన్నదా ? ఇంకా పది కాలాలపాటు ఎందుకు ఉండలేకపోయింది? ఒళ్ళు చెప్పినమాట మనసువిన్నది. రెండూ ఏకమై ఎగిరి పోయినవి.

అతివాంఛ - దేహానికి సంబంధించినంతవరకూ ఆ అమ్మాయి ఆరోగ్యానికి కారణం. అది మన, చేతిచలువను కట్టుపడిపోయింది. అయినా, బ్రతికేదే; ఎందుచేతనంటే మగడు మామూలువాడైతే, ఆమెకూడా అది జబ్బని అంతకు ముందే గ్రహించిఉంటే, అతడు తెలివిలేనివాడైతే తోలి తప్పుకే ఆమెను వదిలివేసి, తనత్రోవ తాను చూచుకుని, సుఖంగా ఉండేవాడు. ఆ అమ్మాయికి అలా నిత్య నూతనా న్వేషణం వెగటైతే ఆత్మహత్య చేసుకునేది.

నేను ఒక కేసు చదివాను. ఓ పిల్ల తాను వ్యభిచరించందీ ఒక్క క్షణం బ్రతకలేనని తెలుసుకుని అలా చేయడానికి అసహ్యాపడి మగనితో ఆ సంగతి చెప్పి తన శీలరక్షణకు చంపేసేయమన్నది. అతడు పాపం ఆ అమ్మాయియందంటే అమితమైన ప్రేమట; అలాచేసేశాడు. అదంతా పెద్దగొడవైనె... సరి...అది మనకు అక్కరలేదనుకో. అసలు విషయం... అదీ ఇప్పుడు యీ పిల్లదానికి అన్నీ ఉడిగి ఆలోచనలోపడిన తరువాత తనలా ప్రవర్తించడం తనకూ జబ్బుఅనేసంగతే విడిచేసి అదే అంతవరకూ తన పసుపూ, కుంకుమా కాపాడుకుంటూ వచ్చింది అని...మగని లోటుపాటేమో తెలుసుకున్నది. అతనిమీద ఎన్నిటికీ అసహ్యంకాని, అతనితో కలియకుండా ఉండటంకాని లేదు. అయితే అందువల్లనే అమితమైన జాలి. అతడు బ్రతుకలేడేమోననే బాధ ఆమెను అమాంతం మింగేసింది.

అతని సంగతి ఏమిటి చేయడం? ఎలా కాపాడటం?

దైవం ఇచ్చిన శక్తి సామర్థ్యాలకు అతనికి లోటేమీ లేదు, సుష్టుగా సుఖపెట్టి సుఖపడగలడు. అది సరి, అందరికీ పరిపాటి అయిన తాహాతు. కాని అతని ప్రకృతి అంతతో శాంతించదు. కావలసిన తృప్తి కనులారా గద్ద తన్నుకు పోతూంటే చూసి బాధపడితేనేగాని.

అది అసలు లేకపోయినా అతనికి అట్టే ఫరవా లేదు కాని. ఇది...ఈ నాటకం లేకపోతే ఎగుడూ దిగుడూ అయి పోతాడు. దీనికి కారణం, అనేక మానసిక రుగ్మతల మహా సమ్మేళనం. డాక్టరు ఫ్రూమ్, న్యాస్టరమ్, హర్షిల్ వీళ్ళందరి నిగాలోకి యిలాటి కేసులు ఒకటి రెండు వచ్చినవి...అంటే యింత క్లిష్టమైనవి కావనుకో. ఏదో వాళ్ళ తంటాలు వాళ్లు పడ్డారు. ఆ గ్రంథాలన్నీ అలుమారలు నిండటమే కాని మనకు ఏమీ యీ విషయంలో ఉపయోగించ లేదు.

నేను చేసే చికిత్స ఏమిటో లఘువుగా ఆ ధోరణి చెపుతాను. మనసుకు ఆలోచించుకునే శక్తి రావడానికి దాని లక్ష్యం క్రమంగా శరీరము మీదికి త్రిప్పి నిలుపుతున్నాను. మనసుకు అంటేటట్టుగా శరీరాన్ని బాధలోకి దింపుతున్నాను. అసలు ఆరోగ్యం చెడనీయకుండా జబ్బు చేయిస్తూన్నాను. కొంతకాలానికి, ఎంతకాలమైనాకానీ అతని మనసులో తన కోసం నిరంతరం తాపత్రయమే కాని వేరు ఆలోచన ఉండదు. ఎందుచేతనంటే నిస్పందస్థితిలో. వెనుకటి అనుభవములో పాదుకుపోయిన మనసు క్రమంగా ఈ ఆలోచనలోకే మేలు కుంటుంది, గనుక ఆ మెట్టు ఒక్కటీ ఎక్కి, అక్కడ పట్టు

చిక్కితే తరువాత అతనిని బాగుచేయడానికి మూడు నిమిషాలు పట్టదు. అప్పుడు మనం మీసంమీద చేయి నిర్భయంగా వేయవచ్చును."

డాక్టరు ప్రసంగం చాలించి, ఉద్రేకంలో మీసం మీదకు పోయిన చేయి అలాగే నిలిపి నా ముఖంమీద నవ్వాడు.

నేను చుట్టూ, మా కాళ్ళకు యివతలా అవతలా చెల్లాచెదరుగా పడిఉన్న సిగరెట్ పీకెలూ కొడ్డీ వాటిమీదనే చూపు నిలిపి "ఏమిటో అర్థం అయిందనుకో. కాని అంతా అయోమయంగా ఉంది" అన్నాను.

'తర్కపాదం తప్పింది సోదరా ! అర్థం అయితే ఇంకా అయోమయం ఏమిటి ? ఇందులో మళ్ళా నిక్కా ? మాకు అర్థం అయి అఘోరించింది గనుక నీకు కాలేదనా? మనసోయి మరేమనుకున్నావు దాని మజా...హు,' అంటూ అనంతమైన బడలికతో ఆవులించాడు. నేను సిగరెట్టుకు ఇంకో సిగరెట్ ముట్టించాను.

# వేదమూర్తులు

'ఇలా బ్రతికేకన్న, చిన్నం ఎత్తు విషం పుచ్చుకుని'

ఆ దీవన మొదసారి తగిలినప్పుడు...అలాగే చేస్తే మేలనిపించేటంత అసహ్యం వేసుకొచ్చింది, సంసారంమీద: కాని అస్తమానమూ అదే పదేపదే అయితే అలవాటు కావడం ఎంతసేపు?

రెండో తారీఖు ఉదయం—

తానే ఎన్నటికైనా అంత ప్రఖ్యాతికి వచ్చి, ఆత్మ కథ వ్రాసుకునే యోగమంటూ ఉంటే, తప్పకుండా ఆ తారీఖుకు బంగారు మలామా చేయిస్తాడు. నిజంగా అది అంత సుదినం.

కొత్తనాటకంకదా పోని అని, కోడికూసే వేళ అయినా నిదుర చంపుకుని కూర్చుని ఏకబిగిని 'ఆసాంతమూ'

చూసి అప్పుడు వచ్చి మంచంమీదవాలితే, మళ్లా అదిరిపడి మేలుకునేటప్పటకి ఎంత బద్ధకంగా ఉంటుంది ? అప్పుడుకూడా అందుకుతోడు ఎప్పటిపాటే మొదలై చిర్రూ బుస్సూ ప్రారంభం అయితే—హుఁ—దేనికైనా ఎన్నటికో ఓనాటికి అంతు అంటూ ఉండాలి !

భీమశంకరం, ఎండ చురచురలాడుతూంటే ఏలాగో అలా ఒళ్లు తెలియని నిదురలోనే ఓపికచేసుకుని, మంచంజాజి పందిరి క్రిందనుంచి నీడకు కాలితో నెట్టి, మళ్ళా సాగిలపడీ అప్యాయనంగా ఒళ్లు విరుచుకుంటూ...యీమారు ఒకటోరకం నిదుర పట్టేది. కాని కన్నుమూశాడో లేదో, చెవిక్రింద రణ భేరి మ్రోగింది.

నిజంగా ఎంతో బద్ధకంగా ఉంది; కాని అనుకుని ఏం ప్రయోజనం ? - అలాగే లేచి, ఆమె అజమాయిషీలో ముఖం కడుక్కుని - అవునుమరి, అన్నిసార్లూ పుక్కిలించక పోతే, అనాచారంకాదూ, తరతరాల పెద్దలూ తగులపడి పోరూ ? ఆ కషాయాన్నే కాఫీగా భావించుకుంటూ గొంతులో పోసుకుని, పక్కాఘామకు మడికట్టుకుని అన్నంముందు కూర్చున్నాడు.

అదిఅంతా రోజూ నడిచే కలాపమే కనుక అందులో చీదర కనిపించడం మానేసి చాలకాలమైంది. కాని, యిది...

'ఎందుకూ అలా దిక్కులు చూస్తూ కూర్చుంటారు ? నాముఖాన ఏముంది ?'

—ఆమాటకు నవ్వురాదూ !

'ఏం చూసుకు ఆ పొంగిపోవడం?'

'ఇంకా మరెవరిని చూడ్డం?'

'ఎందరినన్నా చూడగల సామంతం ఉంది! నా కంఠం కోయడానికి ఎన్ని ప్రశ్నలు కావాలో అన్నీ ఉన్నాయి మీకు; మీరు కాగా దొరక్కపోతారేమోనని మా నాన్న నాకీ పట్నం కట్టాడు, బావుకుంటున్నాను.'

'ఏం మాటలవి?'

'మీ బుద్ధుల కొద్దీని! ఏం ఒరగబడుతుందని చూడబోయినారు, వాళ్లెవరో తెగించి తెయితక్క లాడుతూంటే! ఆ సౌభాగ్యం తలచుకునేనా యీ విరగబాటంతా! ఇలాటి వాళ్ళు పెళ్లి ఎందుకు చేసుకోవాలి? ఎందుకంట?'

—అలా ఆమాటలు వింటూన్నకొద్దీ నవ్వు పొంగి రాదూ?

'అందుకే నాకు దహించుకుపోయేది! నా బ్రతుకంతా నవ్వులపాలుగానే చేశారు. ఇంకా ఎందుకా యికిలింపు!'

'మానేస్తాను పోనీ, యివాళనుంచీ.'

'ఎంతకన్నా సాహసులే.'

'ఏం చేయమంటావు?'

'నేనేం చేయమంటాను? చేయమన్నది మీరేం చేస్తారు?'

'నిజమే!'

'మీఅమ్మకడుపు చల్లగా నా ఆయుస్సుకూడా పోసుకుని వర్ధిల్లండి. అవును, నేనే గంగలో దిగితేనేం, మీ జీవా

నికి ఉసూరుమంటూ! మీకు అచ్చిరాదు; అయినింటి పిల్లను...కావాలని...తెచ్చుకుని...యింత—'

...అప్పుడు యిక విరగబడకుండా ఉండేందుకేమన్నా వీలుందా?

రాజమ్మ పెరుగు సత్తుతప్పాలా, గరిటా క్రిందపడేసి పైటకొంగు కళ్లకు ఉరివేసుకుని, వెక్కి వెక్కి ఏడుస్తూ లోపలికి వెళ్లిపోయింది. అది మామూలు మర్యాదే...

భీమశంకరం విస్తరి విడిచిపెట్టి లేచి చేయికడుక్కుని సావడిలోకి వచ్చాడు నిలువుగుడ్డతో—కృష్ణుడి పటంలో వెన్నముద్ద బొమ్మను పిచ్చిక ముక్కుతో టక్కు టక్కు పొడుస్తూంది.

ఇంకా రోదనం శ్రుతిమించే ఉంది. వింటూన్నకొద్దీ జాలిపెరిగి; లోపలికిపోయి, దగ్గరగా నిలుచుని భుజంమీద చెయివేసి చూశాడు. రాజమ్మ విదిలించుకుని అంతయెత్తున ఎగిరిపడి, రొజుకుంటూ 'మడి మన్నయిపోయింది' అని యినుమిక్కిలిగా స్థాయి అందుకుంది.

అప్పుడు బయలుదేరి వెళ్ళడం...మరునాడు సంజ మసిగేదాకా యింటి చాయలకన్నా పోలేదు భీమశంకరం. ఏ స్నేహితుడితోనన్నా, కలసి కాలం గడపడానికి...ఎవరికీ మొగం చూపించలేనంత సిగ్గవుతుంది. ఎందుకో—అదే తెలియదు.

తనవల్ల ఏ దోషమూ లేదని గుండెమీద చేయివేసుకుని నిబ్బరంగా చెప్పగలడు. అందరూ పడుచు దంపతుల

లాగా హాయిగా ఉండడానికి అనువుగా ఆతనిలో అంతులేనంత కులాసా ఉన్నది; కాని, ఏమిటి లోపం—ఎవరివల్ల ?

ఏమీ ఆలోచన తెగనప్పుడు...ఎవరూ చూస్తుండ నప్పుడు...తనలోతాను అదో మాదిరిగా నవ్వడం అలవాటు చేసుకున్నాడు. ఆ నవ్వే, అవసరంకొద్దీ యింటిదగ్గర ఉన్న ప్రతినిమిషమూ వినియోగించు కుంటున్నాడు. లేకపోతే...

ఎంత ఏడుపు వచ్చినా, అది మింగేసే సత్తువ తెచ్చుకో లేకపోతే। ఒక్కనాటిరగడకే నేలమట్టానికి క్రుంగిపోయి మామూలు సంసారిలాగా అయి—యిల్లు ఓ కొలిక్కి తీసుకు వచ్చినట్టయితే—ఆ బ్రతుకు అయినా ఒకవేళ యింతకన్న బాగుండేదేమో...

ఏమో—

ఎంత బొప్పికట్టింది, తల ద్వారబంధానికి తగిలి తీపు ఎత్తడం మొదలుపెట్టినా, రవంతసేపు ఓర్చుకుంటే సర్దుకుం టుంది దానంతట అదే. కాని ఎదురుగుండా...సగం వెలు తురూ, సగం చీకటిలో నిలుచుని రాజమ్మ తనవేపు గురితప్ప కుండా చూసే చూపు...?

పవలు తిప్పటంతో...తినీ తినకుండా పోవడంలో క్షుత్తు పూర్తిగా మందగించిపోయింది. ఆ పూటకు అన్నం ఆశలేదు. శుభ్రంగా స్నానంచేసి నిద్రపోవచ్చునుకదా అని గుమ్మంలో అడుగు పెట్టేటప్పటికి...

అంత నిస్సత్తువా మరలించుకుని...తిరిగి వెళ్ళిపోతు న్నాడు...మూడు కాలవల వంతెనమీద...పై కమ్మీమీద

చేతులు ఆనించి, మోకాళ్లు రాతిగోడకు మోపెట్టి...రయి మనివచ్చే చల్లనిగాలికి మోరాయించి...ఎదురైనంతసేపూ మొగమాటపడి...ఎక్కడో ఎవరూ చూడనిచోట కలుసు కోవాలని పక్క పక్కల పరుగులుగా ప్రవహించే కాలువలు కనుచూపు మించేదాకా చూస్తూ...ఏమీ ఆలోచన లేక ఎంతోసేపు నిలుచున్నాడు...మెడ అయినా మలచకుండా.

దిగువనుంచి వస్తూన్నలారీ గేర్ మారిన ఊతంలో శర వేగం అందుకుని గట్టును రాచుకుంటూ ఉరవడిగా దుమ్ము విరజిమ్ముతూ పోయింది. హారన్ మోతకు భీమశంకరం ఉలికిపడి చూపు బెసకటంలో...అలా ఎంతసేపటినుంచో పరధ్యానంలో...ఆ పరాయి ఆడదానికి అంత దగ్గరగా నిలుచున్నానే అని...

అందుకు ఏమీ అనుకోలేదు. ఆమె ఏం అనుకున్నదో అని...అలా ఎన్నడూ అలవాటులేని అమర్యాద అప్రయ త్నంగా తనవల్ల జరిగినందుకు ... మెడనరాలు క్రుంగిపోయి నవి. ఇక అక్కడ నిలువకుండా తన దోవను తాను పోతే ఏ యిబ్బందీ లేదు. కాని ఎవరో ఎరుగని ఆమె తనను గురించి ఏలాగో అనుకునేందుకు అవకాశం ఎందుకు ఇవ్వాలి?

ఏమనాలి ?—ఏలా పలుకరించి క్షమించమని అడ గాలి ?– అడగాలా, వద్దా ?– తుదీ మొదలూ కలిసిపోయి, అనుమానాలన్నీ ప్రశ్నలై మెదడులో చక్రవాటాన గిరగిర మంటున్నాయి – పెదవి వణకిపోతూన్నది. ఆమెవైపు పట్టు

బలవంతాన తిరిగాడన్నమాటే కాని...తలఎత్తి చూడలేదు, నోరు విప్పలేదు.

ఈ నాటకమంతా ఆమె కనిపెట్టిందో లేదో కాని, ఏమీ గమనించనట్టుగానే, అక్కడనుంచి కదిలి వెళ్ళిపోతూన్నది వంతెన దిగి, వయ్యారంగా. భీమశంకరం...తన వశం కాక, కళ్లూ కాళ్లూ ఆమెకు అప్పచెప్పాడు.

మారీస్‌పేట పెద్దరోడ్డు వెంటనే కొంతదూరం వెళ్ళి, ఎడమ్మనైపుగా మిఠాయి కార్ఖానా ప్రక్కసందులోనుంచి సరాసరి సున్నంగానుగ దాటిపోయి, గోడకు అటూఇటూ కడపరాళ్ళ దొంతరలు సాగిలిపడి ఉండగా వాటి సందునుంచి వెళ్లి తలుపు గొళ్ళెం తీసి, ఆతనివంక పక్కకు తిరిగి ఓమారు చూసి గుమ్మంఎక్కి లోపలకు వెళ్ళిపోయింది.

సంజె చీకటి, మసక హెచ్చుతూంది. దీపాలు ఇంకా వెలుగలేదు కనుక, కనుచూపుమేర అంతా, అలికివేసినట్లుగా...కదిలే మనుష్యుల ఆకారాలు మాత్రం ఛాయగా కనబడుతూన్నాయి.

భీమశంకరం కొంచెం ఎడంగా సందుమొగుదల నిలుచుని ఉన్నాడు...ఆ ఉనికికి అర్థం ఏమీలేదు. ఎందుకు వచ్చాడో తెలుసును గనుకనా ?- ఇంకా ఎక్కడనో ఉంది?

ఆమె మళ్ళా గుమ్మం అవతలనుంచి తీరుబడిగా తొంగి చూసి, తల కదల్చినట్టు ఆతనికి చూచాయగా పొడగట్టింది. తలుపు కిర్రుమని అటూ ఇటూ ఆడి విసురుగా దభేలుమని కమ్మీకి మ్రోగింది.

—వంచిన తల ఎత్తకుండానే తిన్నగా వెళ్ళి...లోపల ప్రవేశించాడు. అంతకుముందు ఆమె వెంటపడి రావడంలో ఉద్దేశం వేరు. అక్కడకు వచ్చేదాకా కూడా అది మారే వ్యవధి కలుగలేదు, మనసుకి. అంతవరకూ, ఆమె ఎవరై యుండునా అనే యోచనే పోలేదు. అలా, మళ్ళా తొంగి చూడగానే...ఓహో— అనుకున్నాడు.

అసలు దినవ్యవహారంలో అయితే, ఆలాటి చాయలకు పోవాలసిన అగత్యము లేదు...అలవాటూ కాలేదు... అసహ్యాం పైగాను. కాని, అవాళ...తనలో ప్రళయంగా చెలరేగే రాక్షస – తాండవానికి...అవును అవసరం వచ్చినప్పుడు ఏ ఎండకు ఆ గొడుగు పట్టాలి.

వసారాకు సగందాకా అల్లిక వదులైన తడిక అడ్డం కట్టిఉంది. ఆ చాటుగా...మాసినదుప్పటీ, మంచం. గోడ కలుగులో అటూఇటూ వెలుతురుకోసం అద్దంచాటున దీపం. కుర్చీకి ఒక కాలు లేదు. దాన్ని గోడుగా ఊతం చేసుకుని, భుజాలకు అంటే గిల్టు లోలాకులు ఊగించుకుంటూ, చేరెడు వెడల్పు అంచుచీరె కట్టుకుని...కుచ్చెళ్ళమీద చెరగని తాంబూలం కర్రులు సర్ది దాచుకుంటూ...ఆమె నిలుచుని... ఆతను రావడం చూసి...అన్ని జతల బిళ్లేరిగాజులూ గలగలమనేటట్టు చేయి పైకెత్తి ముంగురులు సవరించుకుని...కాలు జూచి తడికతలుపు దగ్గిరగా నెట్టింది...

'కూర్చోండి'... మొగస్నేహితుడికన్నా చొరవతో, చేయిపుచ్చుకుని... మంచం చివరను కూర్చోవేసింది. తాను గోడకు ఆనుకుని నిలుచుని ఉంది.

భీమశంకరం తలలో నిప్పులు చెరుగుతూన్నాయి... ఉక్కిరి బిక్కిరిగా ఉంటే... చెమటలు దిగజారుతూండగా... మెడగుండీలు విప్పుకున్నాడు...

'నా పేరు...నవమల్లిక'.

ఆ మాటకు ఒక్కసారి ఆతనికి తలదిమ్మంతా హరించి పోయి...నలుమూలలా చూసి...ఆమెమీద చూపు నికరంగా నిలిచి...నవ్వు వచ్చింది. జేబులో...గలగల మనిపించి... రెండురూపాయలు ఆమెకు బొత్తిపెట్టి అందించాడు. ఆమె చిరుతలు వాయించినట్టుగా గోరుతో వాటిని మీటి...ఒక్కొక్కటే ప్రోగించి చూసి...అతని ఒడిలోకి విసిరివేసి...అతని కన్న ఎక్కువగా నవ్వింది.

భీమశంకరం తెల్లబోయినాడు. చాలకఅలాచేసిందేమో అనుకోడానికి ... తాను ఏమీ కోరకుండా ... ఉచితంగా అయినా అంతేనేమో ఆ జాతి !—మళ్ళా జేబులో చేయి పెడుతున్నాడు...ఆమె చటాలున చేయిపట్టుకుని ఆపి...

'అంతేనా...' అన్నది, అదేమిటో ఆతనికి అర్థం కాలేదు...

'అన్యాయానికైనా...అంతు ఉంటుంది.'

—ఆమె ఆలా నిజం చెప్పడం ఆతనికి ఆశ్చర్యం వేసింది. అసలు అదికాదు. ఆతడు పొరబడుతున్నాడని గ్రహించి...

'ప్రేమను అంగడిలో పెట్టి అమ్ముకునేవాళ్ళయినా— బాధ కావలెనంటే...కొనుక్కోవలసిందే...'అని ఎంతో జాలిగా అన్నది...మరి, ధూకుడుగా...

'నేను రోజూ అక్కడే నిలుచుంటాను...అది నాకు... జీవనం. అలా చివరగా...ఎక్కడకో అంతుకనబడకుండా పోయే ప్రవాహంకేసి చూసిచూసి...కళ్లు కాయలు కాయ డమే కాని...పండు ఎన్నటికీ పండదని...నాకు తెలుసును... నాకోసం...కాచిఉండేవాళ్ళు నావంక చూడటం అదే అప్పటి ఆశకు అంతు...అందుకోసమే కాదూ బ్రతుకంతా...'

ఇందులో భీమశంకరానికి...ఒక్కముక్క అర్థం కాక పోయినా...ఆమె మాటలు వింటూంటే...అదేమిటో తగని హాయిగాఉంది. మళ్ళా ముఖం తేటబారుతూంది...

'బయట...ఎంత వెన్నెలగా ఉందో చూడండి...' ఆమె ముందు అడుగు, అతనిది వెనుక అడుగూ...

—రెండు అడుగులు వేసిన తరువాత ఆమె తప్పుకుని చీకటిలోకి కలిసిపోయింది...ఎటు వెళ్ళిందో జాడగా...సినీమా పాట ఏదో ఈలగా...మందంగా వినబడుతూన్నది.

భీమశంకరం ... కుచ్చెళ్ళు ... ఎడమమోకాలిమీద మడతలోంచి పట్టుతప్పి...క్రిందకుజారి...అందులో అణగి

ఉన్న రూపాయలు...కాళ్లకడ...దొర్లిగిలినవి. తీసి చేత పుచ్చుకున్నాడు.

మళ్ళా వంతెనదగ్గిరకు వచ్చేటప్పటికి...ఆ వెన్నెలలో ...పసిపిల్లను పొదివి పట్టుకుని కూర్చున్న పేదరాలిముందు, చేతిలోవి...ఎదుటపరచిన చిరుగుల పాతమీద జారవిడిచి వంచిన తలఎత్తి...వెన్నెలకన్న ఎక్కువగా మెరిసే నక్షత్రం వంకచూస్తూ ... స్టేషనుకు వెళ్ళి ... స్టాలులో తాను మోయ గలిగినన్ని పుస్తకాలు ... ఆవాళే వచ్చిన కొత్తవి కొనుక్కుని తిరిగి యింటికి వచ్చేశాడు.

తలుపు ఓరవాకలిగా వేసివుంది. కాలితో తోసి లోప లకు వెళ్లాడు. రాజమ్మ నడవలో కొంగు పరుచుకుని పడుకుని ఉంది ? మరచి. అలికిడికి లేవలేదు.

—ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు...ఏ తెల్లవారు గట్లనో...

రెండో తారీఖు ఉదయం -

మంగళారావాలు చెలరేగుతూండగా తప్పనిసరిగా మెళుకువ వచ్చింది ... భీమశంకరానికి. రాజమ్మకు ఎంత సేపైందో తెల్లవారి.

—'ఏమిటీ నావంక అలా చూస్తారు ?'

'ఎలా చూస్తూన్నాను ?'

'ఏమో నాకేం తెలుసును ?'

'మీకు తెలియకపోతే...'

'తెలియకపోతేనే చూసేది.'

'అవును నే నంటే...'

'కాదు - దేవతలంటే...'

రాజమ్మ అర్థంకాక బిక్కమోహం వేసింది. భీమ శంకరం యీమారు నిర్భయంగా నవ్వాడు ... ప్రసన్నంగా ఆమెవంకచూస్తూ.

—రెండో తారీఖు ఉదయం.

సుఖంగా, ఏ చీకూ చింతా లేకుండా, జీవితం అమరినవాళ్లకే ... ఆ ఎండ చురచురలో రోజులు చురుకుగా గడవడం సాధ్యకావడంలేదు. ఆలాటప్పుడు కాస్త పొరపాటున కను ఏమరితే చాలును కరవడానికి అన్నట్టుగా రాజమ్మ నిరంతరం...కని పెంచే ఆడపులిగా రాచుకుని కూచుండటానికి కారణం తన చల్లనైన ఏదైనా లోపము అవునో కాదో తెలుసుకునేందుకు భీమశంకరం చేస్తూన్న భగీరథ ప్రయత్నాలన్నీ ఏమాత్రమున్నూ ఫలించక, ఎప్పుడు చూసినా ఎప్పటికప్పుడు భస్మరాసులే కనులముందు దుమ్ము ధూళి ఎత్తిస్తూంటే...ఎలా।సర్దుకుపోవాలో తెలుసుకునేందుకు ఓపిక ఉన్నంతసేపూ పెనుగులాడటంలోనే ఆ సంకెళ్లు సడులివ్వగానే తెంచుకు పారిపోవడానికి కాలుదువ్వడం... సామాన్యగృహస్థుకే సజానైన నడవడి అని తోచే సందర్భం అయినప్పుడు...అరచేతి మందవు ఓర్పూ అరిగి రావాకూ పాళానాకు వచ్చినతరువాత భీమశంకరానికి అలా ఆలోచన పోవడంలో ఏ మాశ్చర్యము ఉన్నది?

'నీ మనసు నీకు తెలియదా? లేక తెలిసిచేసే పనేనా యిది? ఇందువల్ల నీవు ఏం బావుకుందా మనుకుంటావో నాకు తెలియకుండా ఉన్నది'—అని తెంపు తెచ్చుకుని, నిలవేసి భార్యను మందలించడానికి ఉపోద్ఘాతం విప్పాడు. రాజమ్మ ఆ మాటలు వింటూ కనురెప్పలచాటున ఆశ్చర్య పడి, అది అంతలో విదిలించుకుని సహజమైన చిరాకుతో 'మీ మాటలు నా కర్థంకావడంలేదు. మావాళ్లు నాకు మీ అంత చదువు చెప్పించలేదు. మీకు చాకిరీచేస్తూ, మీచేత మాటలు పడుతూండమని... మెడకో పలుపువేసి అది మీచేతికి అందించి వెంట తోలేశారు—.' అంటూ ఇక అక్కడ నిలువకుండా లోపలికి వెళ్ళిపోయి వాక్యశేషాన్ని అక్కడనుంచి అరగంటవరకూ చివవలు, పలవలు వేయించి సాగదీస్తూ...అప్పటికీ యింకా అర్థోక్తిలోనే ఆపి ఉంచి... ఏదో పని తొందరలో అప్పటికి అది మరచిపోయింది. అవాళ నుంచి...సందు దొరికినప్పుడల్లా...మళ్ళా అక్కడనుంచి ఎత్తు కోడం...చిత్తం వచ్చినపుడు పనస ఆపడం...భీమశంకరం రెండు రోజులు ఏలాగో అంతా సహించి అంటిముట్టనట్టుగా ఊరుకుని ఇక ఆ తెల్లవారి 'నీవు రాక్షసివి. వేయి చెప్పా-లక్ష చెప్పా...అనుభవంమీద అంటున్నాను అంతే?' అని తనకు తానై నిప్పులు చెరగడానికి ప్రారంభించాడు.

'నాకు తెలియదూ ఆమాత్రం? మీ కళ్లకు నేనంత కన్న, ఏలా కనబడుతాను?'

'కళ్లకు మోహినిలాగా, నా మనసు కళ్లను మోసం చేసింది.'

'మనసును నమ్మనప్పుడు, కళ్లనుమాత్రం నమ్మడం ఎందుకూ? అప్పుడుకాని మీ కళ్లు చప్పగా చల్లబడ వేమో ?— నన్ను ఏం చేయమన్నారో చెప్పండి?'

'నే నేం చేయాలో నాకు తెలియడంలేదు. సుమతీ శతకం దగ్గరనుంచీ మనువుదాకా...అన్నీ అబద్ధాలా అను కుందామంటే ఆడవాళ్ల అందరిలో ఆఖరుకు అధములు అను కునే వాళ్ళలోకూడా 'దేవహాంశ' అణువణువునా కనబడు తూంటే ... నీలో అది ఎందుకు పూర్ణానుస్వారం కావాలి?'

"దేవీ-హాంశ" కాశీమజిలీకథల్లోలాగా సప్తసాగరాలూ దాటి వెళితే అక్కడ సువర్ణద్వీపంలో - ఎఱ్ఱ మఱ్ఱి తొఱ్ఱలో ఎఱ్ఱ యిఱ్ఱి ఏడు పిల్లలను పెడితే వాటిలో కడయిఱ్ఱి తొడ క్రింద ఉంటుంది ... కక్కులగుఱ్ఱం ఎక్కి కదిలి వెళ్ళండి ... తెచ్చి నాలో కలపండి.'

'కష్టపడి తెచ్చి తీరా కలిపితే - విరిగి ఊరుకుంటే.'

'ఇంతకన్న చెడేది ఏముంది?'

'అంతేనా?'

'అవును - మీరన్నమాటే.'

—భీమశంకరానికి జవాబు చెప్పేందుకు నోరు మెసల కండా ఉద్రేకము వచ్చింది. మాటా ముల్లే సర్దుకుని - మారు మాటాడకుండా ఆరాత్రి మెయిలుకు ప్రయాణమై ఊటీ వెళ్లిపోయినాడు. రాజమ్మను ఒంటరిగా వదిలి వెళ్ళ

డమూ అనే మీమాంస దోవలో. బండీ కుదుపు ప్రారంభం చేసింది, కాని ఆమెకు గంపెడు బలగం ఉన్నారు. అంతా సామంతులు. తెల్లవారి లేస్తే ఏదో పనిమీద ఎవరో ఒకరు బస్తీకి వస్తూనేవుంటారు, సాయానికి లోటు ఉండదు అనుకునే నిశ్చింతగా బయలుదేరాడు.

నెలనోజులు చిటికెలమీద గడచిపోయినవి. అలజడి ఏవిధంగానన్నా మరచిపోయి హాయిగా ఉండాలని చేసే ప్రయత్నాలకు, అబ్బే భోగానుభవాలలో అన్నీ విప్పిచెప్ప డానికి వీలైనవే ఉండవు. అసలు ఒక్కొక్కప్పుడు అతి రహస్యంగా ఉంచడంలోనే ఆ నూలువాసి ఆనందమూ మెలికె దక్కుతుంది. తరువాత తీరిక సమయాల్లో మనసులో వెను దిరిగి చూసుకుంటే గోరుమొన అంతే, కొండకు ఏడింతలుగా పింజ విచ్చుకుంటుంది.

కాని, భీమశంకరానికి అంత సామాన్య-సహవాస వశ మున ఆ నీలికొండలచలువ - విలువలో వీసపాలైనా అబ్బలేకపోయింది. అన్నప్పుడూ చలికి వేగుతూ - ఆకాశం వేపుకు వేడిమికి తరువుల అగ్రాలని ఉరకలెత్తించే ఆ కానరాని ఊదర ఆతన్ని తెగ ఊరించుతూన్నది. అందుకనే-'నిన్ను విడిచి ఒక్కక్షణం బ్రతుకలేను'—అనే లాలసకు అనువైనటులల్లా ఎన్ని వన్నెచిన్నెలు తీర్చో-లాభ సాటికి తమచెంతనే నిలుపుకోవాలని చూసిన శీతల-సీమంతినుల ప్రణయ-ప్రణవం అతన్ని ఏకాడికీ కమలా-కానన తపస్వినిగా మార్చలేక పోయింది.

ఎందుకో ఇంటిమీద అంతబెంగ? ఎందుకా అని పరి పరి విధాల ఆలోచించాడు. ఏమీ తేలదు - మైళ్ళకన్న వేగంగా-మనసు ముందుకు పరుగెత్తడంమాత్రమేకాని.

ఇన్నాళ్లూ, ఎక్కడఉన్నదీ, ఎప్పుడువచ్చేదీ ఇంటికి రెండు పంక్తులైనా వ్రాయలేదు. తీరా చేరుకునేటప్పటికి, తాళంవేసి ఉంటే ఇబ్బంది పడవలసి వస్తుందని సరంజామా అంతా స్టేషనులోనే ఉంచి, అవశిష్టాలు అన్నీ తీర్చుకుని... కడుపునిండిన తరువాత కాస్సేపు విశ్రమించి, లేచి కాఫీ పుచ్చుకుని ఇంటికి బండీ కట్టించుకున్నాడు. పవలల్లా ఎండబాగా కాసినా ప్రొద్దు వాలేముందు మబ్బు వేయడంచేత చప్పున చల్లబడి ఊరుకున్నది.

తలుపు పిలుద్దామనుకుంటూండగానే, వీధిలోకి వెళ్లబోతూ, చేత సిగరెట్టుతో బావమరిది ఎదురైనాడు. తను కంట పడటంతోనే సంతోషంగా 'ఓహో! కొత్త పెళ్ళి కొడుకులాగున్నావయ్యా! కుడికాలు వెయ్యి లోపల. మంచి శకునమేలే...మనకు తోడు-చేత అంటిపట్టుకుని అగ్నిహోత్రుడున్నాడు కా. బస్...రైట్ ఎబవుట్ టరన్—కాఫీ కర-కర లాడిద్దాం-సహపంక్తికి దయచెయ్యి...' అంటూ చెయ్యి అందుకున్నాడు. భీమశంకరం చెవులు మాత్రం ఆతనికి అప్పగించి...మనసు మళ్ళించుతూన్న చూపులతో రాజమ్మకోసం వెదకి...అతడు వినసంత తేలికగా నిట్టూర్పువిడిచి తల వంచుకుని అడుగుతీసి అడుగు వేశాడు.

'నేను బెజవాడ వెళ్లుతున్నాను...నాటకం అన్నాడు. ఆ పడుచువాడు...కాఫీ గ్లాసులు ఖాళీ అయిన తరువాత సిగరెట్లకోసం వెళ్లినవాడు అవి తెచ్చేలోపుగా వచ్చి వక్క నములుతూ,

'నేనూ వస్తాను' అని భీమశంకరం ఉత్సాహంగా పట్టుపట్టాడు.

'నీవూనా...ఇవాళ ఏమంత మించిపోయిందనీ ?'

'ఎన్నిమాట్లు అనుకున్నా-చూడటం పడటంలేదు.'

'ఇంకోమారు'

'కాదు - ఈ మారే'

'మనకు - మతి అనే పదార్థం యథాస్థానాన ఉన్నట్టే లెక్క వేసుకోమన్నావా ?'

'ఉండటానికి వూడటానికి ఏం ప్రళయం వచ్చిందని ?'

'అందుకనే ప్రభూ! పసివాడిని, పరమరహస్యాలు నాకు అర్థం అయే యోగ్యత పట్టలేదుకనుక అమాయకంగా అడుగుతున్నాను...నాకూ నీకూ ఎక్కడ వంతు?- నేను వచ్చి బ్రహ్మచారి నన్నసంగతి దేవరకు విదితమేకదా ?'

'నేనూ అంతే...ప్రస్తుతం' అని అందామని, నోటి దాకా వచ్చింది కాని, భీమశంకరం పరువుకుపోయి, బలవంతాన తమాయించుకున్నాడు. అతడు అలా తటపటాయించడం చూసి బావమరది రేచులాగా—

'దేశాటనంచేసి తెచ్చుకున్న వేషాలన్నీ నా దగ్గిర వేద్దామనుకున్నావేం. మా యింటిపక్క తెలుగు మాస్ట

రున్నాడే ఆధీరుడు గడియారానికి బుద్ధిలేక అసలు వేళకన్న అయిదు నిమిషాలు దాటనిచ్చి యింటికివచ్చాడో...ఆవాళ ప్రొద్దుపోయేదాకా ఇక చూచుకో నారంగా, ఇక అదో ప్రణ యంకాదు, విరహంకాదు...ఎంతగ్రంథం చేస్తారనీ, యింటిన పడి?- కమీషనరును స్వయంగావచ్చి విచారించి న్యాయమని తోస్తే ఆ బాధ నివారించి మమ్ములను కాపాడవలసిందిగా అర్జీ పెట్టుకుందామా అని చూస్తున్నాననుకో?- ఇక తమ విషయంలో ఇవాళ దానికి ఎంతపెట్టి హెచ్చవెయ్యాలో? నా పుణ్యాన నాటకం అంటూవచ్చి యింట్లో ఉండకుండా బ్రతికిపోతున్నానుకాని బయట వసారాలో పక్క వేసుకుం టినో, మాటిమాటికీ మయూరుడిలాగా మా అక్కయ్యచేత శాపానికి కళ్లు పొడిపించుకుంటూ ఇంద్రుడల్లే కను - పెట్టు కున్నా - ఈపాటి చూపైనా లేకుండా పోయేవాడిని. అవునా కాదా?'

భీమశంకరానికి వింటూన్న కొద్దీ విపరీతంగా నవ్వు వస్తూంది. కాని నవ్వివేసినందువల్ల నష్టం తనకే! అసలు అంత కాలమునుంచీ గోప్యముగా...అతనికి తెలియజేయ వలసిన అవసరం రానందువల్ల తన యుద్ధాలు తాను చేసి కుంటున్నాడు. అప్పుడు అబద్ధం ఆడటానికి అసహ్యం వేసింది. అధికాపరాధం ఇంకోటి ఉండదేమో అనిపించింది. ఇద్దరికీ అరమరికలు లేవు కనుక, మర్మం విడిచి, బావమరదికి మనసులో మాట ఇక దాచుకోకుండా ఖాళీచేసి చెప్పేశాడు. ఆ ప్రచండకుడు అంతా సావకాశంగా విని...'అసలైన

తెలుగువాడంటే నీవే' అనడంలో, మాటలో అక్షరమక్షరము మరఫిరంగీ మొగ్గలు దూసుకుపోయే వాటంలో గ్రుచ్చివిసిరి— వివరణకు ఉపక్రమించాడు.—

'కాలిఫోర్నియా బ్రతిమాలుకున్నదా లేదా - నన్ను విడిచి వెళ్లవద్దు; వెళ్లిమాత్రం అక్కడ ఇంతకన్న ఎక్కువబావుకుంటావుగనుకనా?'- వాడని వనలతలు, నిడమాయని వనస్పతులు, ఎన్నడూ వసివాళ్వాడని నేను ఇంత అమర - యౌవనం నీపాలు చేస్తూంటే నిలకడగా ఉండి పాలించుకోరాదా?'— యూలిసిస్ రుచికి అంతతీపి వెక్కసమై... కదిసి ముదిసిలే - ముచ్చట తీర్చుకునేందుకు...పదిసంవత్సరాలకు అన్నడో వెనుక యింటిదగ్గర మరచిపోయివచ్చిన యిల్లాలిని వెదుక్కుంటూ తెప్పకట్టుకుని బయలు దేరలా? —అంత పెద్ద చూపువున్నా ... అంత చిన్న ఆశకు అంతుచిక్కిపోయి ... అంతటితో సరిపెట్టుకుని అదే బ్రతుకనుకోవడం.. ఆంధ్రాయ్ లక్షణం అని దివ్య చిత్తమున అవధరించి ... ఇక యింటికి—'

భీమశంకరం మేఘాలమీద తేలిపోయినాడు, యింటికి. రాజమ్మ వీధి సావడిలో కిటికీలో కూర్చుని జాజిమొగ్గలు దండకట్టుకుంటూ, అతనిరాక చూసి కిటికీ రెక్క, 'ఓరువాకిలి' చేసింది. లోపలకు వెళ్లేటప్పటికి, తలవంచుకుని నిలుచుని ఉన్నది. సమీపించి చేతులో దండ అందుకుని సిగలో తీర్చాడు. అమరిక సరిగా ఉన్నదికదా అని చూసుకునే చేతిని

ఆతడు అందుకుంటే ఆమె లాక్కోబోయినా అతడు పట్టు విడవలేదు –

రెండో తారీఖు ఉదయం...

మంగళతూర్యములు మార్మ్రోత మొదలుపెట్టినవి. భీమశంకరం మేలుకుని, కనులప్పళించుతూ పక్కదిండుమీద నలిగిన జాజిరేకల చాలుతో, బావమరది ఉపదేశ వర్ణమాలను భావించుకుంటూ బద్ధకం ఏమీ లేకుండా – హాయిగా పక్కమీదనించి లేచి, రాజమ్మ గొంతు చెలరేగే జాడను పట్టి ఆవేపు వెళ్లాడు.

# గృహిణీపదమ్

౧

'ఆవిడ...మరే...ఆ అమ్మాయిపేరు లీలావతి...'

'ఏ అమ్మాయి?'

ఆ...అమ్మాయే ... ఆ అబ్బాయి లేడూ ... వాళ్ళ అమ్మ...'

'వాళ్ళ నాన్న పేరు...'

'నాన్నే...'

'ఒళ్లు దగ్గరపెట్టుకుని జవాబుచెప్పు ... చదవకుండా ఇష్టంవచ్చినట్టు వాగుతావేం...'

'చెపుతా నుండుమరి...అతడు రాజ్యము...ఊహు... అప్పుడు దేవతలందరూ...ఊహు...ఊఁ...ఇదిగో ఆయనపేరు హిరణ్యకశిపుడు...ఎబ్బే, ఏం పేరు...'

'ఏం...'

'లేకపోతే ఆ పేరేమిటి...అందరూ వెక్కిరించరూ... హిరణ్యా...బలే...బలేపేరు...'

'నీ పేరు మహాబాగుందిలే...'

'బాగా లేదూ?...ఆ అబ్బాయిపేరు చూడు ప్రహ్లాదుడుట...అంతకన్న నాపేరే బాగుంది...'

'సరేకాని, ఆవిడపేరు లీలావతి కాదు...'

'పోనీ'

'అదికాదు...నీ పుస్తకంలో తప్పువ్రాశారు. అసలు పేరు దత్త...'

'ఆ...మరీ బాగుంది...దత్తేమిటి. దత్తా గిత్తాను...'

'నేను చెప్పినట్టుగా చదువు...తెలిసిందా.'

'మరి పంతులు కొట్టడూ.'

'మీ పంతులకి అసలు వచ్చా...'

'రాకపోతే ఏం...కొట్టకూడదూ?'

'నీవు సరిగా చదవకపోతే నేనూ కొడతాను...'

'కొట్టు మరి...మామయ్య నడుగుతా నుండు...' పోనీ మా పంతుల్ని కొట్టరాదూ...అలా చెప్పొద్దని...'

'అసలు పుస్తకం వ్రాసినవాడికే ఓ జెల్లా యిస్తే బాగుంటుంది.'

'నన్ను మటుకు వద్దమ్మా...ఎవరినన్నా కొట్టు...ఆ అమ్మాయిపేరు ఏమైతే నాకేం...పోని, ఆవిడ వాళ్ళ అమ్మేనా...'

'ఆ…కాని పేరు లీలావతి కాదు… దత్త…'

'మరి ఇందులో ఈలా ఉందే…'

'తప్పని చెప్పడంలా…'

'నిజంగా ?'

'ఆఁ…'

'అయితే నే నీ పుస్తకం చదవను…'

అని విసిరిపారేసాడు పుస్తకాన్ని బాబు … ఏదో ఆలోచించుకుంటూ ఆ నాటకమంతా గమనించకుండా, పరధ్యానంగా లోపలికి వస్తున్నాడు నెమ్మదిగా ఆయన. ఆ గ్రంథరాజం…మాక్మిలన్ రెండో వాచకం…తిన్నగా పోయి ముఖానికి తగిలి చేసిన తప్పు క్షమించమని కాళ్ళమీద పడిపోయింది, దెబ్బ తగలకపోయినా, ఆ తాకుడుకి తెలివి వచ్చింది ఆయనకి: తా నెక్కడ ఉన్నది గ్రహించగల మామూలు ధోరణిలోకి వచ్చాడు…ఆలోచనలన్నీ చాలించాడు.

'ఏమి టీ అల్లరి బాబూ.'

'నే నిది చదువను మామయ్యా; యిందులో అన్నీ తప్పులుట.'

'ఎవ రన్నారు ?'

బాబు, 'ఆమే' అని సైగచేశాడు. ఆయన నవ్వి…

'నీ చదువంతా వాడి కెందుకూ…అసలు ధోరణి చెడగొట్టబోకు' అన్నాడు ఆమెతో…

'తప్పులు చదువుతూంటే చూస్తూ ఊరుకోలేను. నేను నిజంగా ఎందుకని ఊరుకుంటున్నాను కాని, ఈలాటివి వ్రాసేవాళ్ళని, అచ్చువేసేవాళ్ళని, చదివించేవాళ్ళనీ...'

'పోనిద్దూ...ఇంతకూ అసలు కథ ఏమిటి'

ఆమె, బాబూ ఎవరికి తోచినట్టు వారు చెప్పారు. ఆయన అంతా విని, మళ్లా నవ్వి.

'నీవుమాత్రం ఆ యీడున ఆలాగే చదువుకో లేదు... వాడికీ కాస్త తెలివి వచ్చిన తరువాత...తెలుస్తుంది...ఇంత చిన్నతనంలో, నీ చదువంతా వాడికి ఏలా అబ్బుతుంది?' అన్నాడు.

'చాల్లేండి...మీరు యీలాటి తీర్పులు బాగా తీరుస్తారు...' 'అవధాన్లగారేంచేస్తున్నారంటే తప్పువ్రాయనూ, దిద్దనూ; ఆయన భార్య ఏం చేస్తూందంటే ఒలుకబోయనూ, ఎత్తుకోనూ...' అన్నట్లు ముందు తప్పులు చదవడం తరువాత దిద్దుకోడం, ఇదేనా జీవితంలో చేసేపని...'

'ఏమిటో, మన జీవిత మెంత...మనం చేసే పనెంత...'

'మళ్లా మొదలా...మాట్లాడితే వేదాంత మేనా...'

'అవును నీకు నచ్చదు...కవయిత్రివి కనుక...'

—బాబు సావకాశంగా అన్నీ ఆలకిస్తున్నాడు... ఆ మాట వినేటప్పటికల్లా బిగ్గరగా నవ్వి...

'కవిత్రి...కవిత్రి ఏమిటి మామయ్యా జాపత్రి...' అన్నాడు...

ఆమెకు ఓమాదిరిగా కోపం వచ్చేసింది: కొంచెం చిడిముడిపాటుతో :

'మీ వేదాంతం నా కవిత్వం...అందుకనే మన గోష్ఠి ఈలా ఉంది' అని రుంజుకుంటూ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

♦ ♦ ♦ ♦

ఇదుగో...

ఓయ్...

నిన్నే...

పలకవేం...

వినబడటంలా...

ఏం చేస్తున్నావ్...

ఎక్కడున్నావ్...

ఓమారి ఈలావస్తావ్...

...ఎన్ని రకాల పిలవడానికి వీలవుతుందో అన్నివిధాల పిలిచి చూసాడు: ఓ సంబోధనకన్నా, లోపలనుంచి...'ఆఁ... వచ్చె'ననిగాని, పోనీ వినిపించుకున్నట్లు జవాబుకాని రాలేదు: పిలిచి, పిలిచి, నాలుగైదు నిమిషాలు నిదానించి చూశాడు. రాలేదు. ఇక ఇది పనికాదనుకుని, దగ్గర బల్లమీది కేస్ లోంచి ఫిడేలు తీసి, కమాన్ దబాయించి పట్టుకుని ఎగుడు దిగుడుగా రెండు మూడుసార్లు తీగెలమీంచి లాగాడు: ఓతీగె తెగింది: అంత ఉత్సాహంతో మరీజోరుగా వాయించడం మొదలుపెట్టాడు. కర్ణారుంతుదంగా, 'విరిబోణి' ఛాయిలో, భైరవిరాగాన్ని భయపెట్టే కొన్ని వింతగమకవిశేషాలు

హాటంత టవి ఉదయించి, నానాగందరగోళం చేసేస్తున్నాయి...
ఆయన ఇంకా అలాగే వాయిస్తున్నాడు...

'...బాగానేఉంది... ఆనాటి కానాడు మరీ వస్తూం దేం...'

'ఏమిటి ?'

'...చిన్నతనం'

'ఎంత పిలిచినా పలుకకపోతే ఏం చేయమన్నావు ?'

'ఏం చేయమన్నాను...ఫిడేలు పాడుచేసి, పనికి రాకుండా చేయమన్నాను...చాల్లెండీ...మరీ నేర్చుకుంటు న్నారు...'

'నీవు రాకపోతే కోపం వచ్చిందేమో ననుకున్నాను.'

'అప్పుడు కాదు, ఇప్పుడు నిజంగానే వచ్చింది...ఏదో ఆలోచించుకుంటూ ఉంటే, ఇంతలో ఏం ముంచుకుపోతూందని ఆలా నిలువనీయకుండా పిలువడం...అంతపనుంటే, మీరే లోపలికి రాకూడదేం...'

'నా కంతమాత్రం ఆలోచన తోచిందికాదు...సరేలే, పోనీ వెళ్లు...ఏమీ లేదు...'

'మరి ఎందుకు పిలిచారు...'

'... రెండంకాలుమాత్రం మిగిలిపోయినాయికాదు నిన్న...ఇవాళ చదివేసేద్దాం...శాకుంతలం పట్టుకునిరా...'

'మన మిద్దరం కలిసి చదువుతూంటే కుదరడంలేదు. నేను విడిగా చదువుకుంటాలెండి...'

౨

'మొగవాళ్ళు...ఛీ...వట్టి పశువులు...'

అన్నది ఆమె చదువుతూన్న సంచిక విసిరిపుచ్చుకుని పారవేసి, చివాలున కుర్చీలోంచి లేస్తూ...

ఆయన ఏమీ మాట్లాడకుండా తెల్లబోతూ ఆమె వంక చూశాడు.

'కానీ...ఎన్నాళ్లు ఏలుతారో చూద్దాం...ఇంత పొగరా...వివేక ముండొద్దూ...'

ఆయన ఆలాగే చూస్తూన్నాడు' రెప్పవేయకుండా.

'ఏం...ఆలా చూస్తారేం...మీకు సంతోషమేగా.'

ఆయనకు ఆ ధూకుడు ఏమాత్రం అర్థంకావడంలేదు... ఏమీ అనకుండా ఊరుకున్నా ఆమె శాంతించేటట్టు లేదు... కోపకారణం ఏమిటో అసలు తెలియదు. ఏ మనడానికీ తోచక నెమ్మదిగా...

'కాఫీ చల్లారిపోవడం లేదూ?...' అని ఆమెవైపు చూడకుండా ముఖం తిప్పుకున్నాడు...

'పోనీండి...ఇవన్నీ చూస్తూంటే నాకు కడుపు ఇదివరకే నిండిపోయింది. నావంతూ, మీవంతూ మీరే త్రాగేసేయండి.'

ఆయన త్రాగబోయినాడు...

'మీకేం...నేనెంత వేదన పడుతూంటే మాత్రం మీకేం...నాకు తోడా, నీడా ఎవరున్నారు దగ్గర నన్నాద

రించేందుకు? నామీద మీకు ఎందుకు జాలి ఉంటుంది? ఓ అమ్మ కన్నబిడ్డను...పరాయిదాన్ని నేనేమైతే మాత్రం మీ కేం...'

'అలాగేం'...అన్నాడు ఆయన చిరునవ్వుతో.

'ఇంకా అలాగేం అంటారు!...మీజాతంతా అంతే... విశ్వాసఘాతకులు...నమ్మించి గొంతుకోస్తారు...ఛీ...వాళ్లను ఎన్నటికీ నమ్మకూడదు...'

ఈ చదువంతా అగమ్యగోచరంగా ఉంది: ఇదివరలో ఎన్నడన్నా కసరినా, విసిరికొట్టినా, ఆ సత్కారాలన్నీ తనకే: ఇప్పటి ధోరణి చూడగా జాతిఅంతకూ తిప్పలు వచ్చినవి. లోకంలో ఉన్నయావన్మంది మొగవాళ్ళూ ఆమె యెడల ఏం అపరాధం చేశారో!

'మరి పెళ్లి చేసుకోవచ్చేం?'

ఆమె మరీ రేగింది.

'మళ్లా అక్కడా మోసమే: మానాన్న చేశాడు ఇదంతా... ఆయనకుకూడా అభిమానమే...ఏమీ తెలియనప్పుడు మోసం చేశారు...నేనా...నేనైతేనా...నాకే అప్పటికి బుద్ధితెలిసిఉంటేనా...పెళ్లికొడుకనేవాడు కళ్లబడేనా అంటే, దిమ్మతిరిగిపోయేటట్టు ఓజెల్లా ఇచ్చేసేదాన్ని...'

'అలాగైతే...మరి...'

'మరిలేదు గిరిలేదు...మీ మొగవాళ్లనే పెళ్లిచేసుకోవాలని ఏశాస్త్రంలో ఉంది. ఆడవాళ్లని మోసగించి వలలో

వేసుకునేందుకు మొగవాళ్లందరూ మొనగాళ్ళే... తెలియక మోసపోతున్నారు. కాని... తెలిస్తే ఏ మానుషమున్న ఆడది... మొగవాణ్ణి పెళ్లిచేసుకునేందుకు వప్పుకుంటుంది... నా యిష్టంమీదనే వదిలిపెడితేనా...మా మామయ్య కూతురు కామాక్షిని పెళ్లిచేసుకునేదాన్ని...హాయిగా ఎంతో అన్యోన్యంగా ఉండేవాళ్లం...'

ఆయన నెమ్మదిగా, మాటకు అడ్డంవచ్చి -

'నిజమే... నేనూ ఏదో ఆడపిల్లను వరించడం మానేసి, మా మేనత్తకొడుకును చేసుకున్నట్లయితే బాగుండేది: ఇద్దరం సైకిళ్లెక్కి తిరుగుతూ. సినీమాలకి వెళుతూ, మరీ హాయిగా ఉండేవాళ్ళం' అన్నాడు.

ఆమె ఓ క్షణం నిదానించి ఆయనవంక చూసి పకపక నవ్వింది...ఆయన చిరునవ్వుతో ఊరుకున్నాడు...

కాని అంతటితో అణగలేదు...ఆ ప్రసన్నభావం రవంతసేపుమాత్రం కనుపించింది...మళ్ళా బొమలు ముడి పడుతున్నవి. ముఖం జేవురిస్తూన్నది...

'చాల్లెండి...మీ మాయలూ మీరూను...నన్ను మర పించాలని చూస్తున్నారా...నేనా...నా కసి ఎన్నటికైనా తీర్చుకుంటాను.'

ఇక నిదానించలేకపోయినా డాయన...

'ఎందుకు ఈ గల్లంతు...ఎవరేం చేశారు...'

అని సరసంగానే ప్రశ్నించాడు...

'మీరే చూడండి...మీ కళ్లు చల్లబడతవి...' అని సంచిక తీసుకువచ్చి — ఆయనమీదకు విసిరివేసినట్లుగా అందిచ్చింది...

ఆయన అందుకుని మెదలకుండా ఊరుకున్నాడు.

'చూడరేం మరి.'

'ఏమిటి...'

'నా మొగం...'

ఆయన ఆమెవంక అమాయకంగా చూశాడు...

'మీకంతా వేళాకోళంగా ఉంది...'

'కాదుగాని...విషయ మేమిటో చెపుదూ. ఎందు కీ రాద్ధాంతమంతా...'

'అడ్డమయినవాళ్ళ కథలూ, పద్యాలూ ... పనికిమాలిన వ్యాసాలూ, ఇవన్నీ వేయవచ్చునుగాని, నా కథకు మాత్రం చోటులేదుకాబోలు ఇందులో...'

ఆయన కాస్త తెప్పరిల్లాడు...

'అదా సంగతి! ... అయినా తిన్నగా మరోమారి చూడు...నీవు పంపిస్తే వేయకుండా ఉంటారా?'

'ఎన్ని మార్లు చూడను ... నాకేమైనా...మతిబోయిందనుకున్నారా ... ఈలాటి చేతగానివాళ్లు ... కథ పంపమని వేధించుకు తినడమెందుకూ .. రెండు ఉత్తరాలు వచ్చిన తరువాతనే, పోనీకదా అని పంపించాను.'

'ఆలస్యంగా అందిందేమో...ఏదైనా ఆలాటి ఆటంకం ఉంటేనేగాని వేయకుండామానరే...అయినా ఉత్తరమన్నా

వ్రాస్తారు కాదూ ... సంగతి తెలియకుండా ఎందు కింత తొందర ?'

'వాళ్ల కేం...ఉత్తరం వ్రాస్తారూ? ఆమాత్రం మర్యాద కూడా తెలుసూ?'

'పోనీ యీమారు పడకపోతేమాత్రమేం ?· నీ గార వానికి లోటా ?'

'ఆ సంగతి మీా కేం తెలుసు ... అయినా మీా కిది అంతా నవ్వుగా ఉంటుంది...కానీండి...ఎన్నటికైనా నేనే గెలుస్తాను...'

లోపలనుంచి 'మామయ్యా' అని బాబు కేక వేశాడు. సందు చిక్కిందే వ్యవధానంగా ఆయన తప్పించుకుని లోపలకు వెళ్లిపోయినాడు. ఆమె వెనుకనుంచి సణుగుతూనే ఉంది.

వెంటనే, బాబూ, ఆయన తిరిగి వచ్చారు...ఆయన ఈసారి నిర్భయంగా ఆమెను చూసి నవ్వేశాడు ... బాబు, మోసుకువచ్చిన పుస్తకాన్ని క్రిందపడేసి తానుకూడా, అర్థం తెలియకుండానే నవ్వడం మొదలుపెట్టాడు...

ఆమె ఆశ్చర్యపడ్డది...

'నీవు చూసినసంచిక పాతది. ఏలా వచ్చిందో పొర బాటున మరి...ఇవాళ...ఇదిగో ఇంకొకటి వచ్చింది చూడు... ఇందులో ఉందేమో'

అన్నా డాయన.

ఆమె చెంగున ముందుకు దుమికి, ఆ సంచిక తీసు

కున్నది: గబగబ పేజీలు తిరుగవేసి, మధ్యలో ఎక్కడనో తీసి, నవ్వుమొగంతో చదవడం మొదలుపెట్టింది...

'ఉన్నదా' అన్నాడాయన.

ఆమె తల ఊపింది...

'అమ్మ! బ్రతికిపోయాం అందరమూను!' అని తనలో తాను ఆమెకు వినబడేటట్టుగానే అనుకున్నాడాయన...

ఆమె కొంచెంసేపు ఏం మాట్లాడకుండా ఉండి, మళ్లా కోపంగా...చూడండి...వీళ్ళ దేం ముంచుకుపోయిందో ...అడ్డమయిన కథలకీ చిత్రాలు వేయించి, నా ఒక్కదానికే మానేశారు...వీళ్లు...'

ఆయన ఇక అక్కడ నిలువలేదు...

3

'ఆహా...ఎంత చక్కగా అన్నాడో మహానుభావుడు ...ఈ మాదిరివి చదివినతరువాత...మళ్లా ఏం మొగం పెట్టుకుని బయలుదేరుతారో కవులమంటూ? ... అయినా ... భావంలో బడాయి...కాగితంమీద పరాయి...ఖరాబు కవిత్వమూయెను ఇప్పటి రకాలందరిదీని!'

'ఒక్క పద్యం...ఒక్క పాదం చివరికి...ఇంత చక్కగా వ్రాస్తే చాలదూ...'శ్వసతి కథ మసౌ రసాలశాఖాం చిర విరహేన విలోక్య పుష్పితాగ్రాం'...ఆహా...'

ఆయన తన్మయుడౌతున్నాడు...ఆమె ఆ వైఖరంతా గమనిస్తూ, ఎకసెక్కంగా చూస్తూ...తనను చూసి అయినా

ఆ ధోరణి మానుతాడేమో...అయినా చూసాడో, లేదో నని, అలాగే, గుమ్మంలో నిలుచుని ఉన్నది, కర్టెన్ సగము తొలగించి...

'...ఎవ రా మహానుభావుడు ?...'

ఆయన ఆమెవంక చూడకుండా, తన ధోరణిలో తా నన్నాడు...ఇక లాభంలే దనుకుని ఆమె...అలా పలుక రించిది...

ఆయన వెంటనే జవాబు చెప్పకుండా...సావకాశంగా ఆమెను లక్షించి తరువాత, మరీ నిదానంగా చిరునవ్వుతో...

'జయదేవుడు...' అన్నాడు...

'ఓస్...ఆత డటండు...అంటే...ఏ జయదేవుడు?... పద్మావతి మగడే కాదూ?'

— అవునని తలఊపాడు ఆయన నవ్వుతూనే...

"నిజమే ... ఆయన కేం ... ఏదో పూర్వజన్మాన సుకృతం చేసుకున్నాడు గనుక ఆలాటి భార్య లభించింది... అంతేకాని ఆయన ప్రయోజకత్వం ఏముంది? ... అదంతా ఆమె పుట్టింటివారి ఆస్తి...అనుభవించడానికే ఆయన... స్త్రీవిత్త మధమాధమం...ఏమిటి ఆయన గొప్ప ఇక?

'ఏం?'

'ఏముంది. ఆమె లేకపోతే ఊరా, పేరా ... మిస్టర్ పద్మావతి అనే ఏమన్నా ఆయనకు గౌరవం ఉంటే!'

'...ఆ మహాకావ్యం...'

'ఆమె...ఆ పద్మావతి రచించింది... లేకపోతే ఆయన తరమా'—

'అలాగేం...'

'కాదేం, మరి: అయినయింటిపిల్ల కనుక, ఎంత అప్రయోజకుడయినా, ఆతన్నే ఆశ్రయించుకుని, ఆతనికి గౌరవం తెప్పించాలనే ప్రయత్నించింది...పెండ్లాం వ్రాసిన కావ్యాన్ని తగుదునమ్మా అంటూ తనపేర పెట్టించుకున్నాడు...చేసుకున్న భార్య ఎంత గుణవంతురాలైనా ... అంతలోకువ...అయినా తిరుగపడదుకదా అనే దిలాసాకూడా ఉందికాదూ...హిందూధర్మంట! మొగవాడికి ఓధర్మం...అదే ఆడదానికి అధర్మం...ఏం న్యాయమో!'

'అయితే గీతగోవిందం స్త్రీధన మన్నమాట'

'ఆఁ...నికరంగా...అయినా ఆమాట అందులోనే ఉన్నదికాదూ'

'ఏమని ?'

'జాగ్రత్తగాచదివితే...నిష్పక్షపాతంగా ఆలోచిస్తే... తెలుస్తుంది...ఓమాదిరిగా చూస్తే జయదేవుడూ అమాయకుడే...గ్రంథంలోనేవ్రాయించుకున్నాడు కాదూ...'పద్మావతీ చరణచామరచక్రవర్తీ' అని...ఇంకా అంతకన్న విశదంగా... విపులంగా. ఏలా చెపుతాడూ...పెళ్లాం కాళ్ళు పిసికి...అంత పెద్దవాణ్ణయినానని...సర్గాంతాన కృష్ణదాసునని చెప్పుకున్నాడుకాదూ మరి...పోనీ పద్మావతికి ఇంకోపేరు కృష్ణ అని విన్నారా ?'

'లేదు...'

'సరే...మీకు కావలసిన సంగతులు ఏవీ తెలియవు!—ఇప్పటికన్నా తెలిసిందా...గీతగోవిందం వ్రాసింది...వ్రాయగలది స్త్రీయేనని—'

'అలాగేం?'

'అవును. మీ సంస్కృతకవులలో ఎంతమంది భార్యలవల్ల పయికివచ్చినవాళ్ళున్నారు!...రాజశేఖరుడు...అతనికి ఓనమాలన్నా వచ్చా?...అవంతిసుందరి వ్రాసిన నాటకాలు కావండీ అవన్నీని...'వాచస్పతి మిశ్రుడు...సరే భామతిసంగతి చెప్పనే అక్కరలేదుకదా...లీలావతిగణితం భాస్కరాచార్యులేనా రచించింది — లోకంలో ఇప్పుడు కూతుళ్ళ సొమ్ము తిన్నారంటేనే విని ఆశ్చర్యపడుతున్నాం...సాపుగా గ్రంథమే కొట్టేసి తనపేరు పెట్టుకుంటే...ఇక ఏమిటి ఆ మహానుభావుణ్ణి చేసేది?...'

'ఇదో కొత్త సిద్ధాంతంలాగా ఉందే'

'మాటకు అడ్డం రామోకండి...కాళిదాసును తీసుకొండి...మీవాడనే అభిమానం విడిచి ఆలోచించండి. ఆ కావ్యాలు, నాటకాలూ, విలాసవతి రచించిందో, లేక ఆతడేనో...'

'సరే...ఇంతకూ నీవు అనే దేమిటి?

'కవిత్వం—చిత్రం — శిల్పం — ఇంత ఎందుకూ, ఏ రమణీయమైన కల్పనన్నా, సృష్టిఅయినా, ఆడవాళ్ళు చేయాలి...పురుషు డెవరండీ—ఆతనిచేత నేమౌతుందండీ...'

'మరి...కొన్ని పురుషులు రచించినవికూడా ఉన్నవి కాదూ?'

'కాదు...సృష్టిలో, నూతన నిర్మాణానికి సామర్థ్యం వినియోగించకలది...అసలు ఉన్నది...స్త్రీయే. స్త్రీ ఒక్కతే... కొన్ని స్త్రీలపేరుతో ఉన్నాయి...కొందరు స్త్రీలే, ఏ మొగుడో, తండ్రో కాజేస్తాడేమోననే భయంతో, చాటుగా కావ్యరచన చేసుకుంటూ, మరోమారు పేరు...ఏ మాఘుడనో, భవభూతనో పెట్టుకునేవారు...'

'నిజంగా'

'అవును...నేను సప్రమాణంగా రుజువు చేస్తాను... ఈ కవులు, శిల్పులు, చిత్రకారులు...అందరూ స్త్రీలేనని...'

'ఆఁ...'

'అప్పటికీకాదు...ఇప్పుడుమాత్రం...ఎంతమంది మొగవాళ్లు పత్రికలకు ఆడపేరున వ్రాసి పంపుతూంటారు...లేకపోతే తమ రచనలు ఎవరూ ఆదరించరని... అందుకనే చూడండి...పరువుగల ఆడది ఈ రోజుల్లో తన పేరున ఏమీ వ్రాయదు...సాధారణంగా మొగపేరు పెట్టుకుని గౌరవం నిలుపుకుంటున్నారు... ఆడపేరున్న ఏ వ్యాసమన్నా... పద్యమన్నా...చిత్రమన్నా బాగుంటుందో ఏమో చూడండి... ఎందుచేతంటే అవన్నీ ఆడపేరు పెట్టుకుని మొగవాళ్లు చేసే పనులు...'

'నీ సిద్ధాంతాలతో ఉక్కిరిబిక్కిరవుతున్నాను. నాకో సందేహముంది, అడుగనా?'



7

'ఊఁ...'

మరి నీకు చాలా పేరున్నదికాదూ... నీవు పేరు మార్చుకోలేదేం...నీవు స్త్రీవా...పురుషుడవా...?'

'మీకెందుకూ... నా సంగతి ?'

'నీవు ఎవరవైతే నాకేం...నీ భర్త నయినందుకు నాకు గౌరవం వస్తూందనే సంతోషం...'

'చాల్లెండి...మీరు ఎప్పుడూ ఇంతే...'

... ... ...

'దయచేయండి శాస్త్రిలుగారూ!'

అని లేచి తాను కూర్చున్న కుర్చీ ఆయనకిచ్చి తాను మరోచోట కూర్చున్నాడు. ఆ వచ్చిన పండితుడు సావకాశంగా కుర్చీలో కూర్చుని, శాలువ అంచు సరిగా పైకి కనపడేటట్టు అమర్చుకుని, గడ్డం సవరించుకుంటూ—

'రేపు ఆచార్యజయంతి కదా...తాము శ్రమతీసుకుని ఉపన్యసించాలని కోరడానికి వచ్చాను. దీక్షితులుగారు, మీరు అంగీకరించక తప్పదని చెప్పమన్నారు...'

అన్నాడు...

ఆయన ఆశ్చర్యపడుతూ...

'మీలాంటివారందరూ, నన్నింత అన్యాయంచేస్తే ఎలా? మీరు నిలుచున్నచోట నిలువడానికికూడా నాకు అర్హతలేదే! నాయందుండే వాత్సల్యంచేత దీక్షితులుగారూ, మీబోటి పెద్దలూ, అభిమానించడమేకాని... ఈ శిష్యుణ్ణి మరీ ముందుకు తీసుకురామోకండి...'

అన్నాడు వినయంగా...

'నాయనా! మీరు నాకన్న చిన్నవారైనా, జ్ఞాన వృద్ధులు...మాకు అందని అనే కాంశాలు మీరు సులభంగా గ్రహించగలరు. మీ మేధాసంపత్తి అలాంటిది. మీరు నిరాకరించరనే కోరుతాను...మీ రందరూ వృద్ధిలోకి వస్తూంటే చూడటంకన్న మాకు వేరే కావాలిసింది ఏమున్నది... అన్యథా ఎంచుకోకుండా, తప్పకుండా పూనుకోవాలి...'

అని ఉపన్యసించాడు ఆ శాస్త్రిల్లుగారు...

'...అహో స్థవిరభల్లుకస్య మంత్రోపన్యాస... పరిహాసకుశలతాచ...'

—శాస్త్రిస్లుగారు తెల్లబోయినాడు...కోపంవచ్చింది ...లేవబోతున్నాడు...

ఆయన ఏమి చలించకుండానే శాస్త్రిస్లుగారితో...

'నా భార్య అండీ ... మురారి చదువుతున్నది ...' అన్నాడు...శాస్త్రిస్లుగారు కొంచెం శాంతించి లేచేప్రయత్నం మానాడు...ఆయన ఏదో సంభాషణ మొదలుపెట్ట బోతున్నాడు, ధోరణి మార్చడానికి ... బాబు పరుగెత్తుకొని వచ్చాడు ఇంతలో ...

'చూడు మామయ్యా! అత్త ఎందుకో ... ఎలా నవ్వుతుందో' అని శాస్త్రిస్లుగారివంక ఓ క్షణం చూసి ... బిగ్గరగా నవ్వి...

'నిన్ను చూసే...అత్త నవ్వుతూంది...' అని నవ్వుకూంటూనే లోపలికి పారిపోయినాడు :

శాస్త్రిస్లగారు సెలవు దీసుకోకుండానే వెళ్లిపోయి నాడు...

ఆయన ఏమి అనకుండా కూర్చునే ఉన్నాడు. లోపల నుంచి నవ్వు వినబడుతూనేఉంది...

కొంతసేపటికి, బాబు ఆమెను అక్కడికి లాక్కుని వచ్చాడు...ఆయన కుర్చీదగ్గరగా ఆమెను తీసుకుని వెళ్లి...

'చూడు మామయ్యా ... తాను మహా బాగుంది కాబోలు...ఎల్లా నవ్వుతూందో చూడు ... — అత్తా! నీవు ఆలాగే ఉంటావులే ముసలాడవైనా ... శాలువ కప్పుకుని ... గడ్డం మీసం అతికించుకుని...'

ఆమె బాబును కొట్టబోయింది ... — తప్పించుకుని పారిపోయినాడు.

'—ఇప్పటికన్నా తెలిసిందా మురారి ఆడదో ... మొగవాడో.'

అన్నది నవ్వుతూ ఆమె. ఆయన చిన్నబోయినాడు.

౪

'...ఆ శారద చంద్రికామందహాసాల్లో— ఆ కిరణామృత వృష్టిలో—యమునాసైకతస్థలాల...రహః ప్రదేశాల ఆ ఆనందమయుడు మురళి మ్రోయించితే, లోకాలన్ని మార్మ్రోగవా? ... ఆ విశ్వమోహనమూర్తి పల్లవించితే, సృష్టంతా పల్లవించదా... ఆవల్లవీ పల్లవుడు... ఆ రాధాలోలుడు...ఆ...

...తెల్లని పాల వెన్నెల...హాయిగా చల్లనిగాలి.... తల దిమ్మెక్కేటట్టు పన్నీరు పూల వాసన— కిటికీ దగ్గరగా, వెన్నెల మీదపడేటట్టు కూర్చుని, ఆమె ఏదో వ్రాసుకుంటూంది.

వంచినతల ఎత్తకుండా గంటకుపైగా ఆమె అలాగే ఉన్నది. కలము సాఫీగా, చకచకా నడుస్తూంది. కాగితాలన్నీ క్రమంగా జ్యోత్స్నారూపాల్ని వీడి కళంకాంకితములై పోతూన్నవి...శచీవల్లభుఁలాగా... రాధకృష్ణులు కలుసుకున్నారు. ఏలాగైతేనేం యమునా తీరాన ప్రణయకోపాలూ, పరిహాసాలూ అన్నీ చాలించి... ఒకరి కౌగిలిలో ఒకరు చేరబోతున్నారు...

మనసులో భావాలు ఎంత ఉబుకుతున్నా, ఇక కలము పట్టడానికి విసుగనిపించింది ఆమెకు. కాని వ్రాస్తూన్నది ఆఖరు కానిది, వదలివేయ బుద్ధి పుట్టడంలేదు... అప్పటికిమటుకు— ఏమీ ఆలోచన తెమలక—దీపం చాలా తగ్గించేసి వెన్నెలలో కూర్చుంది విశ్రాంతిగా.

అక్కడనుంచి చూస్తే తోట చాలావరకు కనపడుతూంది...కొంచెం చలిగా ఉన్నా, ఇక అక్కడ కూర్చుండటానికి మనసొప్పిందికాదు. కాస్సేపు బయట తిరిగితే బాగుంటుందనుకుని, లేచి క్రిందకు రాబోతున్నది, రాధాకృష్ణుల ప్రేమగాధను ఆనాటి కక్కడికి ఆపివేసి.

శాలువ వేసుకున్నది ... అద్దంలో చూసుకుని బాగుండలేదనుకుని మళ్ళా తీసివేసింది...ముంగురులు చెరిగినట్లుగా

తోచి చక్కగా సవరించుకున్నది...ఇక వెళ్ళిదామని అక్కడ నుంచి కదిలి...

—నిశ్చలంగా అలాగే నిలువబడిపోయింది— మొదట కొంచెంసేపుదాకా నమ్మలేకనే పోయింది...భ్రాంతి యేమో ననుకున్నది...వెన్నెలమాయ లేమో... తన కన్నులే మోసం చేస్తున్నాయేమోనని చాలా ఆలోచించింది... పోనీ, నిజమైనా... ఆయన కాడేమో...ఆ విశ్వాసఘాతకుడు ...

—నమ్మలేక, నమ్మలేక ... నమ్మక తప్పనిసరిగా నమ్మింది...మరెవరూ కారు...ఆయనే ఇక...ఆమె !

ఆయన, ఆ యువతిని ... కౌగిలించుకోడం స్పష్టంగా చూసింది... ఎన్నాళ్ళనుంచో, ఈ...ద్రోహము !... తాను కలలోనైనా తలచలేదే... ఆయన మరొక ఆమెను వరిస్తాడని...వరించాలనే ఆ 'యావ'... ఆ సామర్థ్యం ఉన్నదని అయినా అనుకోలేదే—అంత స్వేచ్ఛగా తన కళ్ళయెదుట, తన యింటిలో తనతో అనుభవించాలన్న ఆ ప్రణయమంతా, మరొకతెతో అనుభవించడానికి సాహసిస్తున్నాడా ?... తనమీది కోరికెలు, తాను...తానే తీర్చవలసిన కోరికలు... ఎవతెయో స్వైరిణీ తీరుస్తూన్నదా... ఇంత కాపటికుడా, ఆయన...?

ఇక చూడలేకపోయింది ... ఆ ఉద్రేకంలో తా నేం చేస్తున్నదీ తెలియకుండానే గబగబ క్రిందికి దిగివచ్చింది...

'అత్తా ఇంకా వేళకాలేదూ ?...'అని అడిగాడు అడ్డం వచ్చి బాబు...

ఆమెకు కోపం ఇనుమడించింది... ఆ పిల్లవాని కేమీ బదులు చెప్పకుండానే, ద్రోవతప్పుకునేటట్టు ఆ పసివాణ్ణి తోసివేసి, తాను ముందుకు దూకింది...

'అమ్మా! అప్పుడే బయలుదేరుతారా!' అని చాలా వినయంగా ప్రశ్నించాడు పావ్వర్, మెట్లు ఎక్కుతూ ఆమెకు ఎదురుపడి...

'—అసలు వెళ్లము... నీ వింకా వెళ్ళిపో...'అని గర్జించినట్టుగా జవాబుచెప్పి అక్కడ నిలువకుండాపోయింది... అతడు తెల్లబోయినాడు, ఆమె ధోరణి అర్థంచేసుకోలేక...

ఏలా అక్కడకు చేరుకున్నదో, ఆ ఉన్మాదతుల్యావస్థలో ఆమెకు తెలియనేలేదు...

'చలి వేస్తూందికాదూ'...అని ఆయన మాట వినబడ్డది—

ఆమె, ఆయన్ని చూడనేలేదు...మాట విని చప్పున ఆగిపోయింది...కోపభరంచేత మాటాడనూ లేకపోయింది... కాని ఏలాగైనా పక్కా ఖండితగనుక...

'సరససల్లాపాలకి చలిగా ఉంటేనే బాగుంటుంది కాదూ?' అన్నది ఓరగా ఆయన్ని చూసి.

'ఆలాగేం!' అన్నాడు ఆయన ఆ అమాయకపు... మామూలు ధోరణిలోనే.

'నేను మీ ఏకాంతానికి భంగం కలిగించాను, తెలియక...మీరు, దేవితో కూడియున్నారని అనుకోలేదు... మన్నించండి...ఏదీ ... ఆ సాధ్వీమణి !...'

ఆయన ఏమీ మాటాడలేదు...

'ప్రణయకోపమా ఏమిటి చెప్పరేం...జడతో నీవు కందేటట్టు సత్కారాలు జరిగినాయా?...అసలు...పోనీ... జడఉన్న నాయికేనా...'

'నాయికకు వాలుజడ ఉండాలనే నియమం ఉన్నదా?'

......................................

'ఎవ రానాయిక...ఇంతకూను' అన్నా డాయన...

...'ఎంత అమాయకులు!...తెలియకుండానే కౌగలించ గలిగారు...మీ ప్రియురాలుకూడా... తన బాహులతను... కోమల బాహువల్లరిని...మీ మెడకు పెనవేసిందా...'

ఆయనకు అర్థం కాలేదు...

'అమ్మ! ఎంతవారండి ... మీ వేదాంతమంతా ఇందుకేనా ... ఎన్నాళ్ళనుంచి, ఈ వ్యాసంగం ... నూతన ప్రణయమా, ఏమిటి?'

'ఏమిటి ఈ భావకవిత్వం?'

'నేను చూడలే దనుకున్నారేం... పాపం ఎన్నటికైనా బయటపడకమానదు... ఎవరు ఆమె... చెప్పండి?'

'ఎవరు...ఆమె?'

'నన్ను మోసగించలేరు ... నేను చూచాను... ఎవరో...చెప్పండి...తప్పదు...'

'ఎవరు?'

'చెపుతారా, లేదా?'

'ఏమని?'

'మీ గడుసుదనం చాలించండి...ఎవరు.. ఆమె...ఎన్నాళ్ళనుంచి మీ కీ స్నేహం...'

'ఆమె...?—ఆమె ఎవరో నీవే చెప్పు మరి విసిగించక...తరువాత స్నేహంసంగతి నీకే తెలుస్తుంది...'

ఆమె తాను చూసినదంతా చెప్పింది కోపంగా.

'చెప్పితీరాలి...తప్పదు...' అన్నది...

ఆయన నవ్వి...

'వెన్నెలలో, నీవు పొరబడి ఉంటావు...ఎవరూ లేరు...నాకు...నాకుతోడు ఒక ప్రియురాలుకూడానా...ఈ ఛాందసుడికి—బలే...' అన్నాడు...

ఆమె అంతటితో ఊరుకోక—

'నేను చూశాను...వెన్నెలలో నే మిమ్మల్ని చూసినప్పుడు...మీావద్ద ఎవ రున్నదీ లేనిదీ...మీారు ఒంటరిగా ఉన్నదీ కనబడదేం.. ' అన్నది—

'నేను...నీవు నమ్మినా, నమ్మకపోయినా సరే...ఒక్కడనే ఉన్నాను...వెన్నెల మాత్రం ఉన్నది...'

'వెన్నెల, మిమ్మల్ని కౌగలించిందా?'

'ఏమో...లేక...నిజంగా నేను నీవన్నంత రసికుణ్ణి అయితే...ఏదేవకన్య అయినా నాకు కనబడకుండానే కౌగిలించుకుందేమో ... ఈమారు ఎన్నడయినా నాకు ఆమె కనబడితే నీవు అడిగావని చెప్పనా...అయినా నీకు కనబడి, నాకేల కనబడలేదో...'

ఆమె నవ్వింది...

'ఎంత తెలివిగా మాట్లాడుతారండీ ... మీ మాట నమ్మాలిసిందేనా, నా కళ్లనే నేను నమ్మకుండా?'

'కౌగలించినదన్న... ఆ కన్నె...కనబడనే లేదు ... నీవు అనుగ్రహించరాదూ?'

ఆమె సిగ్గుపడ్డది...

'రండి...చాల్లెండి మీ పరిహాసాలు ... నాటకానికి వెళ్ళాలన్నమాటే మరచిపోయినారా ... అన్నట్టు కారు మీరే నడపాలి ... వాణ్ణి వెళ్లిపొమ్మన్నాను ··· ఇందాక కోపంలో...'

'మహాప్రసాదం.'

... ... ...

'చాలా బాగుందికాదండీ ··· నిజంగా వ్రాసినవారెవరో? ··· ఎవరండీ ఆ మహాకవి? — అప్పుడే నిద్ర వస్తాందా? — అంత చక్కని నాటకం చూసినతరువాత కూడా నిద్ర యేమిటండీ ... అబ్బ ... మేలుకుందురూ ... పాటలు చాలా బాగున్నాయికాదూ? ··· ఆ ఆడవేషంవేసిన అబ్బాయి చక్కగానే పాడాడండీ...వేషం వాడి మొగంలాగా ఉన్నా......'

'ఏమిటో ··· ఈజగమంతా నాటకమేకాదూ?'

అన్నాడు ఆయన నిద్రమబ్బుతో···

'అయితే ··· ఎందుకువచ్చారు, మరి ఈ నాటకం చూడటానికి ··· ఏం వేదాంతమండీ ··· పోనీ, జగన్నాటకాన్నయినా, మేలుకుని చూడండి······'

౨

'...అతికర్క_శతర్క_శతక్షుభితక్షపితక్షపణక్షణ భంగ పదమ్.'

'ఇక చాలించండి - మీ వేదాంతం మోతకో నే తల దిమ్మెక్కి_పోతూన్నది...ఎవరండీ, ఆ కవి?...'

'అప్పయ్య దీక్షితులు.'

'దీక్షితదవానలదుర్విదగ్ధం సాహిత్యమ్ ... ఈతడే కాడండీ ... పళ్ళూడిపోయినతరువాత చెప్పే కవిత్వమంతా యీలాగే ఉంటుంది... కరకరా నమలడానికి పళ్ళు లేవుగనుక, కటుక్ కటుక్ మంటూ కవిత్వం అల్లాడు...నోటిరుచి కోసం...'

'ఆయన చాలా గొప్పవాడు.'

'పోనిద్దురూ...మీరూ అంత గొప్పవారు కారూ... ఆ ధోరణి కాస్సేపుకట్టిపెట్టండి...నాకో సందేహంవచ్చింది.'

'నీసందేహాలు ఎన్నడూ నాదగ్గరకు రావడం మామూలు లేదే.'

'చెప్పండి ... నేను కళ్ళకి జోడుపెట్టుకుంటే ... బాగుంటానా?'

'ఇప్పుడు నాకూ ఓ సందేహం వచ్చింది—నేను చీర కట్టుకుంటే ఇంకా అందంగా ఉంటానా?' అన్నాడాయన నవ్వుతూ...

'బాగుంటారు...ఏం—చివరకి వేదాంతం చీర కట్టుకోవడంలోకి దిగుతూందా?'

'కవిత్వం...కళ్ళజోడుమీద బుద్ధిపుట్టిస్తూంటే...నాకు చీర మనసు కాకూడదేం?'

ఆమె, ఇక అక్కడ నిలువకుండా చివాలున వెళ్ళిపోయింది—'

... ... ...

'నేను ... మీఎదుటబడి చెపుతున్నా ననుకోకండి ...

చెప్పడమే మంచిదనుకుంటాను ... ఒకరిని ప్రేమిస్తున్నాను ... మాటకు అడ్డం రాకుండా తిన్నగా వినండి... ఆయనలో ఉన్న ఆ అద్భుతశక్తిని... ఆయన వైదుష్యాన్ని ...ఆయన రసజ్ఞతను... ఆ ఔచిత్యాన్ని ... ప్రేమిస్తున్నాను ...మీకు సమ్మతమేనా'.

భోజనానంతరం వసారాలో పచారుచేస్తున్నాడాయన మినుకుమినుకుమనే చుక్కలవంకచూస్తూ...ఆమె తాంబూలం నములుతూ, ఆయనకు వక్కలూ, ఆకులూ అందిచ్చి ... ఈ సంగతి తడబాటులేకుండా చెప్పేసింది...

ఆయన ఏమీ కలవరపడలేదు. అలా నెమ్మదిగా తిరుగుతూ ... చిరునవ్వుతో, మామూలు మాదిరిగానే... శాంతంగా...

'సరే' అన్నాడు...

'ఎవరో తెలుసునా'.

'ఎవరు...ఎవరో, నాకెందుకూ తెలియడం ? ...

'పోనీండి—చాలా చక్కగా కథలు వ్రాస్తాడండీ ఆయన...పేరు నాకూ తెలియదు...ఓం...అని సాధార

ణంగా పడుతూంటుంది...ఆయన ఎవరో...ఆయన దర్శనము చేయాలి...'

'ఓం...అంటే...'ఆయనే'...అనగా మగవాడనే ఏలా ...నీ సిద్ధాంతం ప్రకారం, ఏ సౌభాగ్యవతో కావాలికాదూ మరి...'

'కాదులెండి...నా మనసుకు తెలుసు... తప్పకుండా ఆయన...పురుషుడే ... మా యిద్దరికీ ఏదో జననాంతర సౌహృద మనుకుంటాను ... ఆయన భావాలూ, పోకడలూ, అన్నీ నాకు చాలా తెలిసినవిలాగా ... నే నెన్నడో విన్న వాటిలాగా...కనబడుతూంటాయి... నేను, ఆయనను ఎంతో ఎరుగున్నట్టుగా అనుకుంటూంటాను ... ఎవరో ... ఎన్నడు చూస్తానో...మీరు... నాకు సాహాయ్యంచేస్తారా...'.

'అయితే ... నీవు మరోవిషయం ఆలోచించాలి ... ఓం...అన్న సాంకేతికం, ఒక్కడినే నిరూపిస్తుందని ఎలా? ... 'ఓం'...లో త్రిమూర్తుల అంశలున్నాయి...అందుచేత నీ'ఓం' కూడా అంతేకాకూడదూ ... అప్పుడు నీ వన్నట్లు ... ఆ ముగ్గురిలో ఉండే అద్భుతశక్తిని కలియవేసి ప్రేమించాలిసి వస్తుంది...'

'మీ పరిహాసాల కేం? – మీకు సమ్మతమైనా ... కాకపోయినా ... నేను ... ఆయనను – ప్రేమించాను ... తెలిసిందా?'

'మంచిది 'క్షేప్యం చింతామణిం పాణిలబ్ధ మబ్ధా యదీచ్ఛథ' ... గంపెడు కవిత్వం కొడుకుల్నీ, కూతుళ్ళనీ

ఎత్తి...కలకాలం సుఖంగా వర్థిల్లండి ... ఆ అద్భుతశక్తి ... నీవ్వాను.'

... ... ...

'ఎన్నాళ్లకు!—ఎన్నాళ్ళకు నానోము ఫలించింది—'

'ఏం—విశేషం ?'

'చూడండి ... ఆయన ఉత్తరం వ్రాసాడు ... తన క్రొత్తపుస్తకాన్ని కూడా పంపించాడండీ ... 'శిరీషమాల' ఎంత చక్కని పేరో...అంత చక్కని పేర్లు ఊహించగల... ఆయన... ఇంకా ఎంతచక్కగా ఉంటాడో ... నేను ధన్యురాలనండి ... నా ప్రేమను ... ఎవ రేమన్నా సరే .... వెల్లడిస్తాను ఇంక... కొంతకాలము ఆయనతో కలసిమెలసి ఉండాలని ఉంది...?'

'పూర్తిగా సగుణోపాసనలోనికి దిగుతున్నావు.'

'విశుద్ధమైన ప్రేమకు కళంకమేమున్నదీ...రాధలాగా, నేనూ... నా మనోనాయకుణ్ణి...ప్రేమించాను...ప్రేమిస్తాను.'

... ... ... ...

'—నేను మిమ్మల్ని వదలి వెళుతున్నా ననుకోకండి — ఎన్నటికైనా ఈలా జరగాలిసిందే ... మన దోవలు వేరు— మన ఆలోచనలు వేరు—మన ... అదృష్టాలు వేరు — నేను అగ్నిసాక్షిగా ... మీభార్యను...కాని నా మనస్సు...దానికి అధినాథు డింకొకరు...వెళ్లనా...'

'మానసికంగా ప్రేమిస్తూ...నీవు వెళ్లడ మెందుకు?... మనసును పంపివేసి నీవుండిపోరాదు...ఒక్కతె వెళ్లగలదు లే.'

'నీ మనసు తప్పిపోదు ఎక్కడాను...'

'అవును...నే నభిలషించేది ఆయన సాన్నిధ్యం...'

'చెప్పవేం మరి...అయినా, చేత్తో కథలు వ్రాస్తూ... నోటితో ప్రేమ... ప్రేమ...అని చెపుతూ...చివరకు మనసు తో నా ప్రేమించేది...'

'మీరు నా ప్రేమను అర్థం చేసుకోలేరు...'

'కొన్ని పాఠాలు చెప్పి వెళ్ళరాదూ?...విద్యాదానం చేసినదాన వవుతావు...ముందుకు ఎన్నడైనా అక్కరకు వస్తాయేమోకూడాను...'

... ... ... ... ...

'ఎందుకూ... ఎందుకూ... అలా విచారిస్తావు?... కలకంఠికంట కన్నీ రొలికిన...'అని చిన్నప్పుడు పెద్దవాళ్లు బెదురుపెట్టేశారు...నన్ననుగ్రహించి మానేద్దూ... ఏమిటీ విచారానికి కారణం...చెప్పవూ?

'విచారమా... నాకీ ప్రపంచంలో విచారణకారణ మేమున్నదండీ...చూడండి...'శిరీషమాల' నాకే అంకితము చేశాడు ... నా జీవితము ధన్యమైందండీ! ... ఆయన... నా మీద...ఈ దీనురాలిమీద ఎందు కండీ ఆయనకు అంత దయ ... నేను అర్హురాల్నా ఇంత గౌరవానికి...'

'నీకు ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా కష్టమే...ఇదంతా సంతోషమేనా?...'

'మీకు విచారమా?...

... ... ... ...

'ఎప్పుడు వెళ్ళడం ?'

'ఎక్కడికి?'

'నీమనో...'ఆయన' వద్దకు...'

'...నాయిష్టం వచ్చినప్పుడు...'

'మరి...ఆయనకు...ఇష్టమేనా ?'

'మీా కెందుకూ ?'

'అత్తా...మామయ్యను కొడుతావు కాదూ...చూడు ఏం చేస్తున్నాడో...'

'ఏం చేశారూ...?'

'మరే... నీవు వ్రాసుకుంటావే ... ఆలాగే చిన్న కాగితాలమీాద తానుకూడా...రాసేస్తున్నాడు...'

'ఏమిటి...? ఉత్తరమా ?'

'ఉత్తరం కార్డుమీాదకాదూ రాసేది... చిన్నముక్కల మీాదే...ఏమిటో పిచ్చిరాతలు...'ఆ అమ్మాయి తలలో... మల్లెపూల చెండు...జారి పడిపోయింది...' ఎందుకు అత్తా ! ఆలా రాయడం ?'

'ఏమో......'

"ఇంతేనా...నీకు తెలియదూ...పోనీ ఇంకోటి చెప్పకో చూద్దాంమరి...మామయ్యపే రేమిటి ?'

'నీకు తెలియదూ ?...'

'ఆపేరు కాదు ... ఇంకో కొత్తపేరు...'

'నాకు తెలియదు...కొత్తపే రేమిటి...'

సరేలే...నీకు ఏమీ తెలియదు మరి...నేను చదవలేదని...నాకు ఏమీ రాదని నన్ను కోప్పడుతావుకాదు ...మామయ్యపేరు తెలియదు...ఏంరాసేదీ తెలియదు...

'పోనీ నీవు చెప్పుదూ!'

'ఉహుఁ...'

... ... ...

'ఈలా ఓమారు రావూ?...' అని పిలిచాడు ఆయన ...ఆమె వినిపించుకోకుండా వెళ్ళిపోతూంది... ఆయన పరుగెత్తుకుని వెళ్ళి పట్టుకున్నాడు...

'నేను పిలిచాను... వినపడలేదూ?...' అని నవ్వుతూ అడిగాడు ఆయన...

ఆమె తల వంచుకున్నది...కళ్ళ వెంబడి జలజల నీళ్ళు రాలుతున్నవి...

'నన్ను క్షమించ ... ఉహు ... నా అపరాధాన్ని... నన్ను ఎన్నటికైనా మరచిపోగలరా...ఎన్నడన్నా దయతో ...నన్ను తలుచుకుంటారా...నా మాట అనుకుంటారా...'

'ఏం విశేషం...నిన్ను మరచిపొమ్మన్నావా?.'

'సెలవా...నన్ను మన్నించండి...'

అని ఆయన పట్టు వదలించుకుని ముందరకి పోబోయింది...ఆయన ఆమెను ఆపి...

'ఏమిటి అపరాధం? ... ఎక్కడకు వెళుతావు? ...' అని అడిగాడు.

'స్వర్గానికి...ఉహు... కాదు, నరకానికి'

ఆయన నవ్వాడు ... ఆమె ఇక దుఃఖ మాపుకో లేక పోయింది...

—ఆయన, ఆమెను చేరదీసి సమాశ్వాసించాడు...

'నీ వేంచేశావు...నేనూ కథలు వ్రాయకుండా ఉండ లేక పోయినాను... కాని ... నీఅంత బాగా వ్రాయలేను ... నీ పేరు... ఫలానా ఆయనభార్య అని...చెడగొట్టట మెందు కని...ఏదో...పేర వ్రాస్తున్నాను...'

'ఇంకా నన్ను ... మన్నించరూ ... ఇక నేను కలం పట్టను... మీ—మీ భార్యను అవుటమాత్రం చాలు ... అంత గౌరవానికి నోచుకున్నందుకే ... ధన్యురాల నయి నాను...'

'కాదు...నేను ఇక వ్రాయను...నీవు...నీవే ఇందుకు తగినదానవు...లోకంఅంతాగౌరవిస్తుం టే... నిన్ను... చూసి సంతోషిస్తుంటాను...'

'అంతకన్న మంచిపేరు దొరకదనా ? ... 'ఓం' అని పేరు పెట్టుకోవడ మెందుకూ ?'

'చెప్పలేదూ... నీవూ... నేనూ... బాబు... మన ముగ్గురం కలిసి...ముక్తసరిగా...ఏమవుతాము...'

... ... ...

'మామయ్యా !...మరిచిపోయినా... ఓం... ఓం'... ఓం...'

'ఏం పొగరు రా... తన్నులు కావాలా... అన్నది ఆమె...

